

నూత్న వధువు

చిత్రకారిణి : కుమారి శ్యామల కొండేపల్లి—విజయనగరం.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



# సచిత్ర వారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 36
25-5-55

మన్మథ జ్యేష్ఠ శుద్ధ చతుర్థి బుధవారం

"పంకిలతటాకమున విరిసిన
పద్మపత్ర జలాంజలి!"

ఫోటో : ఎస్. రామకృష్ణ—[illegible]

# రాళ్లు

"అణోరణీయాన్ మహతో మహీయాన్" అన్నట్లు అణువు మొదలుగాగల సర్వ చరాచరాలలోనూ ఇమిడియున్న ఈశ్వరాంశ మానవునిలో మహత్తర పరిణామంపొంది పరిపక్వతచెందిన కారణంగా నారాయణునితర్వాత అంతటి వాడు నరుడే అని మనము గొప్పగా అనుకొంటాం. అయితే, "నెమరువేయడం" అన్న గుణం మనలో ఇంకా నిలిచియుండడంవల్ల మనలోని ఆ పరిపక్వతతోబాటు పశుప్రకృతిన్నీ వుందనే ఊహించవచ్చు. ఈ రీతిగా మన పుట్టుపూర్వోత్తరాలను గురించిన వివరాలను గూర్చి "నెమరువేసు"కుంటూ వెనకకు వెళ్ళితే మనలోని "నారసింహా"లలో "సింహం" అనే జంతు లక్షణంతో సహా "నార" అనే వృక్ష లక్షణం కూడా మిళితమై యున్నదనే విషయం గోచరిస్తుంది. అంతేకాక, అచేతనమైన రాతికీ మనకూ మధ్య పరిణామవాద రీత్యా ఎన్నోతరాలు గతించినా ఆ తత్వంమాత్రం మనలో శిలా శాశ్వతంగా ఇంకా నిలిచి వుండడం విశదమవుతుంది.

ఆ రాయి తాలూకు గట్టితనమే మనలో ఇంకా మూర్తీభవించి యుండడానికి దక్కిని సాక్ష్యం మనమందరం "గట్టి" వారము కావడమే. మనలో కొందరివి సహజంగా రాతిగుండెలు. వీరిని గురించే వేమన "పరగ రాతిగుండు పగలగొట్టగవచ్చు- కొండలన్నియు పిండికొట్టవచ్చు. కఠినచిత్తు మనసు కరిగింపగారాదు" అన్నాడు. మరి కొందరు పరిస్థితులు తారుమారుకాగా "గుండెరాయిచేసుకొని, బండకట్టుకొని" బావిలో దిగుతారు. కండ పుష్టికలిగి జవసత్వాలతో జవాకేలాగా వుండేవారిని అరవంలో "కల్లు పిళ్ళయార్" (రాతి విఘ్నేశ్వరుడు) లాగా వున్నాడంటారు. ఇతరుల బ్రతుకుల్లో "బండవేయడం" కొందరికి వృత్తి. దీనినే తమిళంలో "తలైలే కల్లు పోడరదు" (నెత్తిన రాయి వేయడం) అంటారు. "చలిచెందిరమీద రాళ్ళురువ్వే"టంతటి పరోపకారపారీణులు కొందరు. ఇతరులమెడకు "గుదిబండ"గా తయారై కష్టపెట్టే అవాంఛనీయవ్యక్తులున్నూ మనలో లేకపోలేదు. "నీనెత్తిన బండపడా!" అనేది ఒక సామాన్యమైన తిట్టు. కార్యసాధకులకు కొందరు వ్యక్తులు "బెల్లంకొట్టిన రాయి" వలె దేనికీ పలకరు, ఉలకరు, కదలరు, మెదలరు. కొందరు వ్యక్తులు ఇతరులమీద "రాళ్ళురువ్వడం" పరిపాటి. కోపం వస్తే కూడా కొందరు రాళ్ళతో కొట్టుకుంటారు. ఈ తత్వం మానవులలోనే కాదు; దేవతల విషయంలో కూడా కనిపిస్తుంది. కృష్ణుడిమీద కోపంవస్తే దేవేంద్రుడు "వానిరిగా రాళ్ళవానవడి" కురియించినాడు. అందుకు సహాలుగా గోపాలకృష్ణయ్య గోవర్ధనగిరిని పెకలించి గొడుగుగాపట్టి గోపగోపీ జనాన్ని రక్షించినాడు. నాతినే రాతిని జేసింది మునిశాపం. ఆ రాతిని నాతిగామార్చింది రామపాదరజం. ఆదర్శ పురుషులు సామాన్యజనాన్ని "సూదంటురాయివలె" ఆకర్షిస్తారు. ఏ పనైనా గుట్టుగా జరిగి పైకి ఏ విషయమూ పొక్కని పరిస్థితిని "కణత్తులే కల్లుపోట్టాపలె" (బావిలో 'రాయివేసినట్లు) అని అరవంలో అంటారు.

వివాహాలలో వియ్యాలవారి మధ్య కయ్యాలు ప్రారంభమైతే "వియ్యపురాళ్ల" రాపిడి తప్పదు. చెకుముకిరాళ్ళవలె ఈ వియ్యపురాళ్ల రాపిడివల్ల రవ్వలు రేగి కొంపలు రగులుకోవడం కద్దు. ఆయగ్నికి ఆజ్యాహుతిగా ఆడపడుచుల దెప్పులు తోడైతే మనసులకు నొప్పులున్నూ తప్పని సరే. ఈ వియ్యపురాళ్ల విసుళ్ల ఫలితంగా వియ్యంకుల హృదయాలకు గట్టిదెబ్బలే తగిలి బాధపెట్టడం కూడా సహజమే. ముగువలు మంచప్పుడు మునుమరాళ్లుగావుండి తర్వాత జవరాళ్లయి, క్రమేపీ కర్కశత్వం హెచ్చి వియ్యపురాళ్లుగా తయారై సమయానికి బిగుసుకు పోతారు.

ఆటవిక వ్యక్తిగా జీవించిన ఆదిమ మానవుడు నాగరికత అలవరుచుకోవడం ప్రారంభించినది "రాతియుగం" నుంచే. కాబట్టి మానవజాతి పురోగమనంలో రాయి మొదటి "మైలురాయి" అనవచ్చును. మనం ఇండ్లు కట్టుకోవడానికి ఇటుకరాయి వాడుకుంటాము. వంటయింటికి కడపరాయి పరిస్తేనే కడిగి శుభ్రం చేసుకోవడంలో కష్టం కనిపించదు. సంపన్నుల గృహాలకు చలువరాళ్లు వాడుతారు. మహారాజుల నందనోద్యానవనాల్లో "చంద్రకాంత శిలావితర్దికలు" నిర్మించుకుంటారు. వారి కిరీటాలనిండా నవరత్నాలనబడేరాళ్ళే. వారు తలపాగాలలో ధరించేది తురాయి. త్రాగేదిసారాయి. పెంచేది పావురాయి. ఈ రాజులను గురించే వేమన "రాళ్లనమ్మియున్న రాజాధిరాజులు కూడికొడలి భువిని కూలిచనిరి, రాళ్లు పగుల గొట్టి రాతుసపుత్రులు, మాళ్లు నూళ్లు కలిగి మనిరి వేమ" అన్నాడు. క్రమంగా మన రాజుల పరిపాలన క్షీణించి "పరాయి" రాజులు పాలించడం ఏర్పడి, వారు మనమీద పెత్తనాలు చెలాయించడానికిగాను "వైస్రాయి"ని మనమీద పెట్టినారు. ఆ వైస్రాయి పాలనంలో విధించిన పన్నులలో "ఆక్ట్రాయి" డ్యూటీ (*Octvoi duty*) ఒకటి. బెంగాల్ బాబులకు "రాయి" పట్టం వుంది. ఈ బెంగాల్ "రాయి"ని చూస్తే బ్రిటిషు ప్రభుత్వం బెదిరింది.

ఇండ్లల్లో పిండి విసరడానికి తిరగటి రాయి ముఖ్యం. రుబ్బురాయి, పచ్చడిబండ

---

ముఖచిత్రం : ఛాయాదేవి.

కూడా అంతటి ముఖ్యమైన వస్తువు లే. అన్నీ వుండి సన్నికల్లు లేకుంటే చచ్చినంత పని అవుతుంది. దోసె పెనానికి అరవంలో "తోశెకల్లు" అంటారు. గృహిణికి కావలసిన పరికరాలలో "గుండ్రాయి" కూడా ముఖ్యమే. సాటియిల్లాలికి సంతానం కలిగిందని ఓర్వలేని గృహిణి ఒకతె కడుపు మీద గుండ్రాతితో గుద్దుకొన్నదట. "గుండ్రాతికి కాళ్లువచ్చి గునగున నడిచెన్" అని ఒక సమస్య ఇవ్వడం జరిగింది కవిగారికి. ఆ సమస్యను కవీశ్వరుడు..."కోదండ్రాము పదము సోకిన, గుండ్రాతికి కాళ్లువచ్చి గునగున నడిచెన్" అని పూరించటేకాక "ఇంద్రాప్రాసంబు కవుల కివ్వందగునే" అని సమస్య నిచ్చినవారిని మందలించినాడట. ఇన్ని రాళ్లూ చాలక ప్రతియింట్లోనూ సానరాయికూడా వుంటుంది.

వంటయింట్లో పరికరాలన్నీ రాళ్లయితే వండే భక్షణాలలోనూ "ఉండ్రాళ్లు" అని ఒకటుంది. ఆ ఉండ్రాళ్లకుగాక ప్రతి సాధకంలోనూ ఉప్పురాళ్లు పడకుంటే ఉపయోగం లేదు. ఆ ఉప్పులోనూ రాతిఉప్పు (*Rock Salt*) అనేది ఒకరకం. గృహిణికి ముఖ్యంగా కావలసిన ఈ రాళ్లన్నీ ఒక ఎత్తయితే, రాతిచిప్పలు (రాచ్చిప్పలు) ఒక ఎత్తు. పాత్రసామానుల మీద ప్రాణాలు కొట్టుకోవడం అటుంచి, మహిళామణులకు మురిగలమీద మక్కువ ఎక్కువ. సతీమణులు వానిని స్వయంగా తోముకొని స్వయంగా వాడుకొంటారు. మగవారి చేతుల్లో పడి మురిగరాళ్లు దక్కవని వారి అభిప్రాయం. రాతిచిప్పలో పెట్టిన చారు రసనకింపుగా వుంటుందన్నది వారి సిద్ధాంతం. అందులోనూ, సైదాపేట మొద్దు రాతిచిప్పలు మనలో బిరుదులుగా వాడబడేటంతటి పేరు ప్రఖ్యాతులు గడించినవి. ఇంతేగాక, ఇంకా కొన్ని పలగల రాళ్లతో కమ్మలు, ముక్కుపుడకలు కట్టించుకోవడమంటే స్త్రీలకు సరదా. ఆ మోజు ఎంతవరకు వచ్చిందంటే చివరకు రంగూన్ రాళ్లయినా సరే కొందామన్నంతవరకు వచ్చింది. వారికి "నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు తళుకు బెళుకు రాలు తట్టెడేల?" అనే వేమన నీతి తెలియదేమో!

మనం తొడుక్కునేది షంరాయి. అంగడి వీధిలో వెళ్లితే కిరాయి కొట్టువుంటుంది. ఆ కొట్టు ఆసామీ వాడేవి వీశె గుండు, అర వీశెగుండు అనబడే తూకం రాళ్లు. పుణ్యక్షేత్రాలకు వెళ్లి తలలు "గుండ్లు" చేసుకొంటాము. ఉద్యోగస్తులకు ముట్టేవి జీతంరాళ్లు. వడ్రంగి వాని పనిముట్లలో ఆకురాయిఒకటి. వెండి బంగారాల నిజాయితీ ఒరపిడిరాయి, లేక గీటురాయి సహాయంతో కనిపెడతారు. సర్కారు వారు పొలాల సరిహద్దులు నిర్ణయించి సర్వేరాళ్లు పాతిస్తారు. రోడ్ల నిర్మాణానికి పనికి వచ్చేవి కంకరరాళ్లు. ఆంగ్ల భాషాజ్ఞాన శూన్యుడైన అసెంబ్లీ సభ్యుడొకడు ఏదో చర్చల సందర్భంలో "అందరి కంకరమీదనే నా కంకర కూడా వేయించండి" అన్నాడట. ఇంతకూ "*I Concur*" అనేమాట అతనిలో ఆ విధంగా సంకరం పొందిందన్నమాట. బొంతరాళ్లతో గోడలు కడతారు. ఆ బొంతరాళ్ల చిల్లర స్వరూపాలే గులకరాళ్లు. కొందరు ఎక్కడ ఏవిషయాన్ని గురించి మాట్లాడినా "పడికట్టు రాళ్ళ" వంటిపదాలు పదేపదే వాడి తమ ఉపన్యాసాలను ఊకదంపుగా పరిణమింపజేస్తారు. ఊరిపెద్దలు గ్రామీణ సమస్యలన్నీ "రచ్చబండ" వద్దనే పరిష్కారం చేస్తారు. చిన్నవాళ్లది "రాళ్లుమింగి జీర్ణం చేసుకునే వయస్సు" అని పెద్దలంటారు. కొండెగుర్తులు పెట్టుకొనే కొందరు ప్రయాణాలు సాగిస్తారు. "రోహిణి ఎండకు రోళ్లు పగులును" అని ఎండ తీవ్రతను అంచనా వేసినారు అబ్జర్వేటరీ సహాయంలేకనే ఆనాటి పెద్దలు. "నీకూ నాకూ కాదంటే రోలెక్కి తలంబ్రాలా?" అనేది ఒక సామెత. "రోళ్లు తలదూర్చి రోకటిపోటుకు జంకడమా?" అనేదిన్నీ ఇంకోసామెత. అన్ని ప్రయత్నాలు చేస్తే, ఏదైనాఒకటి ఫలించకపోదా అనే ఆశా భావాన్నే "పదిరాళ్ళు విసిరితే ఒకటైనా తగలక పోతుందా?" అనే మాటలో అనుభవజ్ఞులు ఇమిడ్చినారు. చిన్న చిన్న రాళ్ళను కొందరు "కొండపిండెలు" అని చమత్కరించినారు. ఈ సందర్భంలో ఒక చిన్న కథకూడా చెప్పవలసి వస్తుంది. ఇద్దరు వ్యక్తులు గుళ్లోకి వెళ్ళినారు. ఒకడు



# రాళ్లు



కూలి విరాట్టును చూచి "రాయిరా" అన్నాడు. "కాదు, అది స్వామిరా!" అని మొదటివాడు మందలించినాడు. తర్వాత కొన్నాళ్ళకు వీరిద్దరూ ఒక సత్రంలో భోజనం చెయ్యడం సంభవించింది. మొదటివాడికి అన్నంలో రాయి తగిలింది. "ఛీ! రాయిరా!" అని వాడు దాన్ని వుమ్మేసినాడు. రెండవవాడు, "ఛీ! అది చిన్న స్వామిరా!" అని మొదటివాణ్ణి చెంపఛెళ్ళు మనిపించినాడు. శ్రీనాథమహాకవి కూడా ఈ చిన్నరాళ్ళనుగురించి "చిన్న చిన్న రాళ్ళు చిల్లరదేవుళ్ళు. నాగులేటిరాళ్ళు నాపరాళ్ళు" అని శెలవిచ్చియున్నాడు. కాని వేమనమాత్రం, "రాయి దేవుడైన రాసులు మ్రింగదా?" అని, "రాతిబొమ్మకేల రంగైన వలువలు" అని ప్రశ్న వేసినాడు. వీరబ్రహ్మంగారున్నూ, "చిల్లర రాళ్లకు మ్రొక్కుచునుంటే చిత్తము చెడును ఒరే, ఒరే! - చిత్తము నందలి చిన్మయ మూర్తిని చూచుచు నుండుట సరే సరే" అని తత్వం చెప్పినారు. మరొక మహానుభావుడు "రాతిలో కప్పకాహార మాతతముగ నిడెడు దైవంబు మర్త్యులకేలమాను?" అని తిండివిషయంలో తిప్పలు పడవద్దన్నాడు. ఇది గాక, ఇంకా చాలా సందర్భాలలో వేమన, "రాతి బసవని గని రంగుగా మ్రొక్కుదు. కసుకు బసవని గని గ్రుద్దుచుంద్రు."

అని చేసిన తప్పును చెప్పి చూపినాడు. "సతులగవయనేల సుతుల బొందగనేల వెతలు పడగనేల వెఱ్ఱివగుచు, నేల మీది రాయి నెత్తికెత్తినయట్లు" అని వేదాంతం బోధించినాడు. "చెప్పులోనిరాయి చెవులోనిజోరీగ కంటిలోని నలుసు కాలిముల్లు ఇంటిలోనిపోరు ఇంతింతగాదయా" అని మనకుండే ఈతిబాధలను పేర్కొన్నాడు. ఇదే విధంగా తను చెప్పే నీతులకు దృష్టాంతాలుగా రాళ్లనే వాడడంవల్ల ఆయన వాక్కులు శిలాక్షరాలై నేటికీ చెక్కు చెదరకుండా నిలిచివుండి మామూలు శిల్పానికేగాక కవితా శిల్పంలోకూడా రాళ్ళతో పనివుందని తెలుస్తుంది. సాహిత్యపు విలువలుకూడా రాళ్లదృష్ట్యానే విమర్శకులు నిర్ణయిస్తారు. కఠిన పదభూయిష్టమైన రచనను "చిట్టెంరాయిలాగా" వుందని, "గులకరాళ్లమీద బండి నడిచినట్లు" కటకటలాడుతూందని వారు విమర్శిస్తారు.

కాలగర్భంలో కలిసిపోయిన మన ప్రాచీన నాగరికతనుగురించి నేడు కొంతకు కొంతైనా తెలుసుకోకలగడం ఆనాటి శిల్పాలు, శిలాశాసనాలు, శిథిలాలయాలు అక్కడక్కడా కనిపించడంమూలంగానే. *Great men will see tongues in trees, books in running brooks, sermons in stones and good in everything*" అని షేక్స్పియరు మహాకవిఅన్నాడు. అటువంటి కవితాదృష్టితో హంపీశిథిలాలను వీక్షించిన కవీశ్వరుడు, "శిలలు ద్రవించి యేడ్చినవి" అంటే అది అక్షరాలా నిజమనే నమ్మవలసివస్తుంది.

సంగీతపరంగా చూస్తేకూడా రాళ్లకు స్థానంకద్దు. రాళ్ళు కరిగేటట్లు, మోళ్లు చిగిరించేటట్లు పాడితేనే సంగీతం. "జంత్రగాత్రముల రాల్గరగించు విమలగాంధర్వంబు విద్యమాకు" అని పెద్దన తనవాటి సంగీత విద్యాకౌశలాన్నిగూర్చి గొప్పగా చెప్పుకున్నాడు. ఆంజనేయులవారొకసారి తన "విమల గాంధర్వ విద్య"తో "రాల్గరగించి" చూపి నారద మహర్షికి గర్వభంగం చేసిన వృత్తాంతం అందరికీ తెలిసినదే. మొదలు పెట్టినప్పటినుంచి ఒకేరీతిగా విధీ విరామం లేక సాగిపోయే ఒకరకం స్త్రీలపాటకు "రోకటిబండపాట" అని పేరు. అసలు రోకటిబండ అనేది ఒక క్రిమివిశేషం. కీచురాయి అనేదికూడా ఒకపురుగే. "దానిని యింటికి పోనేల రాయితో కొడనేల - ఉల్లిపాయ, ఓమం తెచ్చి ఉడకపెట్టే కట్టనేల, దక్కొనైన పెండ్లికొడుకుకు కక్కుముంగళం" అనే ఎగతాళిపాట స్త్రీలు పెండ్లిలో పాడతారు. "కొండమీది రాయి జారి కొక్కిరాయి కాలు విరిగె. దానికేం మందు!" అనే పిల్లలపాటలోకూడా రాయి దొర్లింది!

శిలాజిత్ భస్మం, రాతినార (కేన్సర్) అని వైద్యశాస్త్రంలోనూ రాతిపేరు వినవస్తాయి. ఇంతెందుకు ఘనవైద్యులుకొందరు కొన్ని మందుల్లో "పాషాణం" కూడా వాడుతారు. పటికానికి *Alum stone* అంటారు. సున్నంలో రాతిసున్నం ఒకరకం. ఆ సున్నపురాతికే *Lime stone* అని పేరు.

తక్షశిల, ఓరుగల్లు (ఏకశిలానగరం లేక ఒంటిమిట్ట), రాళ్లకుప్పం, కొండాపురం, కొండపల్లి చంద్రగిరి నీలగిరి, కనిగిరి, తిరుమలగిరి రాళ్ల పేర్లమీదుగా ఊళ్లు కూడా వున్నవి. "గుండ్లకమ్మ" అనే పేరిట నది వుంది. పాటిబండ, రాళ్లపల్లి అనే ఇంటిపేర్లు కలవు. కొండయ్య, కొండారెడ్డి, వెదగిరి, తిరుమలరావు, శేషాద్రిశర్మ, బండరాముడు, గుండురావు అనే నామధేయాలున్నూ మనలో చాలామందికి కనిపిస్తవి.

మనంకోపంవస్తే ఒకర్ని ఒకరు బండబూతులు తిట్టుకుంటాము. అందువల్ల మన తత్వంలో జీర్ణించివుండే బండతనం బయటపడుతుంది. అందుకే పెద్దలు మన గుణగణాలు రాళ్లదృష్ట్యానే విమర్శించినారు. తత్కారణంగా మనలో "బండవెధవలు" మొదలుకొని "బంగారు కొండలు" దాకా రకాలవారి తత్వాలుగల మనుష్యులు తారసిల్లుతారు. కాబట్టి అందరూ బ్రతుకులు బాగుచేసుకొని ఆత్మోన్నతి పొందడం అవశ్యం. అట్లాఆత్మోన్నతిపొంది, సంస్కృతీ శిఖరాలను అంగుకొని, ఆదర్శప్రాయంగా వున్నవారినే అందరూ "రాళ్ళపల్లెలోన రాళ్లెన్ని పుట్టెనో, రాళ్లలోన వజ్రాలు పుట్టె- వజ్రాలలోన వలపెట్టుపుట్టెనో, కీర్తనీయ చరిత! కృష్ణశర్మ!" అని కీర్తిస్తారు. "ఎవరా కృష్ణశర్మ? ఏమాకథ?" అంటారేమో! వారే, రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు— ★

**కథావాహిని:-** 5, 6, 7, సంపుటాలు; ఒక్కొక్కదాని ప్రతి వెల 1-0-0; దొరకుచోటు: ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ.

5వ సంపుటంలో అవసరాల సూర్యారావుగారి కథలు ఆరు ఉన్నాయి. 'లలిత కళ్లు' అనే కథలో మాతృత్వభాగ్యం కోసం సరళ అనే యువతి పడే వేదన, తన పిల్లడిని ఆమెకు ఇచ్చివేసిన లలిత అనే మరొక స్త్రీ స్వార్థత్యాగం కథకుడు చాలా హృదయంగమంగా చిత్రించారు. 'మేకప్' అనే కథలో సినిమాతారలపై వెర్రివ్యామోహం కలిగిన ఈకాలపు బాలుర మనస్తత్వాన్ని కథకుడు హేళనచేశారు. 'ఉక్కుపిడికిలి' 'ఆల్ ఈజ్ వెల్' అనేవి రెండూ నేటి రాజకీయ పరిస్థితులు ఆధారంగా రచింపబడినవి. ఉప్పు సత్యాగ్రహంరోజుల్లో ఉప్పుపిడికిలి పట్టిన వరహాలు స్వాతంత్ర్యానంతరం రాజకీయాలలోని స్వార్థాన్ని ఎదిరించడానికి ఉక్కుపిడికిలి బిగించడం ఒక కథలోని వస్తువు. రెండో కథలో కడలూరు జైలులోని రాజకీయ ఖయిదీల నిరశనదీక్ష వర్ణితమైనది. జైలువార్డర్లు 'ఆల్ ఈజ్ వెల్' అని గస్తీ తిరుగుతూంటే ఖయిదీగా ఉన్నకవి 'కాదు, ఆల్ ఈజ్ వెల్' అని సవరిస్తాడు.

సూర్యారావుగారి కథల్లో చైతన్యం, ఆవేశం కనిపిస్తాయి. శైలి పదును పెట్టినకత్తిలాగ చురుకుగా తగులుతుంది.

6వ సంపుటిలో అవసరాల రామకృష్ణ రావుగారి కథలు 12 ఉన్నాయి. వినోదం, ఆహ్లాదంకోరకు ఈకథలు చదవవచ్చును. హృద్యమైన కథాశిల్పం చదువరులకు గిలిగింతలు పెడుతుంది. పత్తేదారుదినకర్, పారలుకమ్మినకళ్లు, పెద్దల చిన్నతనం, కలపు పరీక్ష, బాహ్యాంతరాలు మొదలైన కొన్ని కథలు బాగున్నాయి. వీటిలో చాలావాటిలో కొస మెరుపు, చమత్కారం ఉన్నాయి.

7వ సంపుటిలో కొంఠి కృష్ణమూర్తిగారి కథలు 12 ఉన్నాయి. ఇవికూడా చదువరులకు ఉల్లాసం కలిగించేకథలే. దేశసేవకుడు, సంస్కారివంటి కొన్నికథల్లో సాంఘిక ప్రయోజనం కూడా కనిపిస్తుంది.

**తొలికిరణాలు:-** వర్ధిష్ణు సాహిత్య చిత్రకళా సంపుటి; సంకలనం "తాత;" ప్రచురణ: "కళాసాహితి" ప్రచురణశాఖ, ఏలూరు. వెల 1-0-0. ఈ సంపుటిలో వి. వి. వి. ఆర్. సుబ్బారావుగారి కథ, కె. పి. బాబు, పచ్చారు, సారథిగార్ల "జేబుదొంగ" ఏకాంకిక, కొన్ని గేయాలు, వ్యాసాలు, చిత్రాలు ఉన్నాయి.

ఇటీవల కొందరు రచయితలు ఇదివరలో అచ్చయిన తమ రచనలను క్రొత్త రచనలన్నట్లు ఇప్పుడు తిరిగి మాకు పంపడం, కొందరు ఇతరుల రచనలను అన్యభాషలలోనుంచీ, తెలుగులోనుంచీ సంగ్రహించి స్వతంత్ర రచనలుగా పంపడం జరుగుతున్నది. వీరు సోదర రచయితలకు, మాకు జరుగుతున్న అపచారాన్ని గుర్తించడంలేదు. మాకు వచ్చే రచనలను, అనుమానంతో పరిశీలించడం రచయితలకుగాని మాకుగాని గౌరవప్రదం కాదని గుర్తించవలసిందిగా వీరిని ప్రార్థిస్తున్నాము. ఇందువల్ల చిక్కులకు లోనుకావచ్చునని ఇట్టివారు గ్రహించడంమేలు. ఇదివరలో మా పత్రికలోగాని, ఇతర పత్రికలలోగాని ప్రచురించబడిన వేలాది రచనలను చదివి జ్ఞప్తిలో ఉంచుకోడం ఏ సంపాదకునికైనా అసాధ్యమైన విషయమని ప్రత్యేకం చెప్పనవసరంలేదు.

అన్యథా సూచించినప్పుడు తప్ప, మాకు వచ్చే రచనలు మొదలైనవి, పంపినవారి స్వతంత్ర రచనలేననే, భావంతోనే మేము ప్రచురించడం జరుగుతుందని అందరూ గుర్తించ ప్రార్థన.

## మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలనుకూడా గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

సీరియల్

# ఉదయ కిరణాలు

సూర్యుడు అస్తమించగా సంధ్యారాగం సమసిపోయి మసక చీకటు కమ్మాయి. రోడ్డుమీద విద్యుద్దీపాలు ఒక్కసారిగా గబుక్కున వెలిగాయి.

కాలేజీ మైదానంలో ఫుట్‌బాల్ ఆట కట్టిపెట్టి, కేరింతాలతో, నవ్వుకుంటూ, హాస్యం చేసుకుంటూ, ఈలలు వేసుకుంటూ, హుషారుగా పుస్తకాలు పుచ్చుకుని బయలుదేరారు యింటికి, చిట్టిబాబు, ప్రకాశం. ఆరోజు ప్రకాశం ఆనందానికి మేర లేకపోయింది. క్లాసులో ఇంగ్లీషులో మొదటి మార్కు వచ్చింది. క్లాసు రూలు ప్రకారం మాష్టారు ప్రకాశాన్ని మానీటరుగా చేశారు. పైగా సాయంత్రం ఫుట్‌బాల్ పందెంలో తనజట్టు ఐదు రూపాయిలు గెలిచింది. ఆఅయిదు రూపాయలతో మర్నాడు ఒక టీపార్టీ చేద్దామనుకుంటున్నాడు. ఒక్కరోజులో ఇన్ని సంతోషవిషయాలు తన్ను చుట్టుముట్టడంవల్ల, ప్రకాశం లేత హృదయం జీవితంలోని దిగ్విజయాలు తలుచుకుంటూ ఏదో పరవశత్వం పొందింది.

"నువ్వు బలే అదృష్టవంతుడివిరా" చిట్టిబాబు పొగిడాడు ప్రకాశాన్ని.

"కష్టపడితేనే అదృష్టం వస్తుందిరా" అన్నాడు ప్రకాశం.

"నీకు ఫస్టుమార్కు వచ్చిందని, ఆ వెంకటేశం లోలోపల ఏడుస్తున్నాడు. వాడి మానీటరు పదవి పోయిందిగా మరి!"

"పోనీలెద్దు - వాడుఎలావుంటే మనకేం. ఒకళ్ళని ఎగతాళి చెయ్యకూడదు"

"ఈవేళ అమ్మతో చెప్పి మీ నాన్నకు ఉత్తరం రాయిద్దాం"

"నేనే రాద్దామనుకుంటున్నా."

"ఒరే, రేపు నన్ను కూడా టీపార్టీకి పిలుస్తావా లేదా"

"నువ్వులేకుండా నేనొక్కణ్ణే తినగలనా?"

"ఆఖరి గోల్ తమాషాగా చేశావే"

"మరి మనకు అయిదు రూపాయిలు వచ్చేయోగం ఉందికదురా"

చిట్టిబాబు, ప్రకాశం, నవ్వుకున్నారు. ఆటలవల్ల చెమటలతో బట్టలు తడిసిపోయి, చొక్కా బొత్తాములు వదులుగా వదిలేసి, గబగబ నడకసాగించారు యింటివైపు.

దారిలో సత్యనారాయణస్వామి కోవెల కనిపించింది. మామూలుప్రకారం, ఒక నిమిషం దేవుడికి దణ్ణంపెట్టుకుందామని ఆగాడు చిట్టిబాబు, గుడికెదురుగా వీధిలో.

"ఒరే ఈవేళ గుళ్ళోకివెళ్ళి ప్రసాదంతీసుకుని ఇంటికిపోదాంరా," ప్రకాశం ప్రతిపాదించాడు. ఇద్దరూ కలిసి గుళ్ళోకివెళ్ళారు. గంటలు గణగణ మ్రోగించి, దేవుడి కెదురుగా సాష్టాంగప్రణామాలుచేశారు. "బాగా చదువు వచ్చేటట్లు చెయ్య" మని ప్రకాశం దేవుడికిదణ్ణం పెట్టుకున్నాడు. పూజారి పెట్టిన శఠకోపం అంగుకుని, కొబ్బరి ప్రసాదాలు నములుతూ బయటికివచ్చారు యిద్దరు.

"బాగా చీకటి పడిపోయింది. దొడ్డమ్మ ఏమంటుందో" అన్నాడు ప్రకాశం.

"ఫరవాలేదురా. నె చెబుతాగా యీవేళ మనంచేసిన గమ్మత్తులు!" చిట్టిబాబు సముదాయించాడు.

ఇద్దరు అంగలు వేసుకొంటూ ఇంట్లో అడుగుపెట్టారు. వరండాలో హరికేను లాంతరు తనకు వీలైనంతకాంతితో వెలుగుతోంది. చిట్టిబాబు తల్లి రాధమ్మ, ప్రక్కయింటి అమ్మలక్కలు, రాధమ్మ మరిది సోమయాజులు, చెల్లెలు సీతమ్మ, అందరూ ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు దవడలకు చేతులు ఆనించుకుని కూర్చున్నారు. రాధమ్మ కాళ్లు ముడుచుకుని దీనంగా ముసుగు సవరించుకుంటోంది. ఇంతమంది యిలా ఎందుకు కూర్చున్నారా అనే సందేహం మొదటకలిగినా, తమ ఆనందంలో ఆ పరిస్థితి లెక్కచేయకుండా "అమ్మా! అమ్మా! మరేమోనే" అంటూ చిట్టిబాబు రాధమ్మ దగ్గరకు పరుగెత్తాడు. "ఒరే గొడవపెట్టకు," కసిరింది రాధమ్మ.

"అదికాదే. ఈవేళ ప్రకాశానికి ఫస్టుమార్కు వచ్చింది ఇంగ్లీషులో. వాణ్ణి మానీటరు చేశారు. పైగా ఫుట్‌బాల్ పందెంలో ఐయిదు రూపాయలు గెలిచామే" అంటూ గబగబా జరిగినవిషయాలు చెప్పేడు చిట్టిబాబు. 'ఒరేయ్! నోర్ముయ్!' తీవ్రంగా అరిచింది రాధమ్మ. చిట్టిబాబు తల్లికోపానికి ఆశ్చర్యపోయినాడు. మళ్ళీ అందరిలోనూ మౌనం మూర్తీభవించింది.

గుమ్మంలో అడుగుపెట్టగానే యీ దృశ్యాన్నంతా గమనిస్తున్న ప్రకాశం గుమ్మంలోనే ఏదో జరిగిందేమో అన్న భయంతో ఆగిపోయాడు. ఫస్టుమార్కు, మానీటరు పదవి, ఐదురూపాయల గెలుపు, ఈ తన దిగ్విజయాలు చూసి అందరికీ ఈర్ష్య కలిగిందా అనే అనుమానం ప్రకాశానికి తట్టింది. కాని రాధమ్మ ఒకరంటే అసూయపడే మనిషికాదు. అసలు ఏదో ప్రమాదం జరిగిఉంటుందని, ఏమయిందో అని భయసంభ్రమాలతో కొయ్యలా గుమ్మంలో నుంచుండిపోయాడు ప్రకాశం.

సోమయాజులు ప్రకాశంవైపు చూసి ఒక నిట్టూర్పు విడిచాడు. సీతమ్మ ప్రకాశాన్ని క్రిందనుంచి పైదాకా పరీక్షించి ముఖం దించుకుంది. అమ్మలక్కలు ప్రకాశాన్ని చూసి గుసగుసలాడుకున్నారు.

"ప్రకాశం! ఇలా రా నాయనా" రాధమ్మ ఆప్యాయంతో కళ్లనీళ్ళు పెట్టుకుంటూ పిలిచింది.

పిల్లిలా అడుగులు వేసుకుంటూ, బెదురుతూ అందరి ముఖాలవైపు చూస్తూ, పుస్తకాలు పుచ్చుకుని రాధమ్మ ప్రక్కనే చిట్టిబాబు దగ్గరగా కూర్చున్నాడు ప్రకాశం.

"ఏం దొడ్డమ్మా!" మెల్లిగా గొణిగాడు ప్రకాశం.

రాధమ్మ మాట్లాడలేదు.

"దొడ్డమ్మా!..." ఇంకేమీ అనలేకపోయాడు ప్రకాశం.

"మీ నాన్న లేచిపోయాడని ఉత్తరం వచ్చింది" రాధమ్మ నీళ్లు నములుతున్నట్టు చెప్పి, వెక్కివెక్కి ఏడ్చింది.

ప్రకాశం లేతమనస్సులో గాభరా పుట్టింది. నాన్న లేచిపోయాడా? ఎక్కడికి? ఎందుకు? ఏమయింది? అమ్మ, చెల్లాయి, తమ్ముడు ఏం చేస్తున్నారు? అమితంగా ఆదరించే నాన్న, తను కష్టపడుతూంటే చూడలేని నాన్న, ఒక వారం కనిపించకపోతే పరుగెత్తుకుంటూ తన్ను చూడ్డానికి వచ్చే నాన్న, హఠాత్తుగా ఎక్కడికి వెళ్ళిపోయాడు? తన కింక నాన్న లేడా!... ఏవేవో వింత ఆలోచనలు ప్రకాశం హృదయంలో కల్లోలం రేపాయి.

"నాన్న...నాన్న..." ఇంకేమీ అనలేక గొల్లున ఒక్కసారి బిగ్గరగా ఏడ్చేశాడు ప్రకాశం.

"ఊరుకోరా నాయనా!" అంటూ రాధమ్మ ప్రకాశాన్ని ఒళ్లోకి తీసుకుంది. ప్రకాశం దుఃఖం ఆపుకోలేక ఏడుస్తూనే



వున్నాడు. చిట్టిబాబు ప్రకాశం ప్రక్కనే చేరి అతడి తల నిమిరేడు

"నల్గురికీ రాసి, ఎక్కడికైనా వెళ్ళేడేమో కనుక్కుందాం" సోమయాజులు తెగించి ఒక అభిప్రాయం వెలిబుచ్చాడు.

ఇప్పుడు కోటిపల్లిలో మాణిక్యమ్మ పిల్లలతో ఎలా వుంటుందో, డబ్బుందో లేదో, ఒకసారి నువ్వు వెళ్లి కనుక్కువస్తే బాగుంటుంది." రాధమ్మ మరిది సోమయాజులు వైపు చూసింది.

"అలాగే" అంటూ సోమయాజులు లేచాడు ఇంటికి నడుద్దామని. సీతమ్మ భర్తను అనుసరించింది.

అప్పటికే బాగా చీకటి పడుతున్నందువు అమ్మలక్కలందరూ ఆశ్చర్యంనుంచి తేరుకుని తమతమ పనులు నిర్వర్తించుకుందామని కొంగులు దులుపుకుంటూ లేచారు.

రాధమ్మ అందరినీ సాగనంపి తలుపులు వేసుకుంది.

"చంటిబాబులూ! కాస్త అన్నం తిందురు గాని" అంటూ రాధమ్మ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"నాకు ఆకలిలేదు దొడ్డమ్మా!" ప్రకాశం కళ్ళనీళ్లు తుడుచుకుంటూ వసిగాడు.

"ఏడిసేవు! రెండు ముద్దలు తిను ... మీ నాన్న తిరిగి వస్తాడులే. అనవసరంగా బెంగ పెట్టుకోకు!" కేకలేసింది రాధమ్మ.

"రారా! నువ్వు భోంచెయ్యకపోతే నేనూ చెయ్యను!" అంటూ, చిట్టిబాబు ప్రకాశాన్ని లేవదీశాడు.

మజ్జిగఅన్నం తిని ప్రకాశం లేచి పోయాడు. రాధమ్మ ముందు కర్తవ్యం ఆలోచిస్తూ, జరిగిన విషాదపరిస్థితికి లోపల బెంగతో అన్నం తినలేదు. వంటింట్లో అన్ని మూతలు పెట్టి కుర్రాళ్లిద్దరికీ ప్రక్కలు వేసి తను పడుకుంది

రాధమ్మకు ఎంతసేపటికీ నిద్రరాలేదు. ప్రకాశం రాధమ్మ చెల్లెలు మాణిక్యమ్మ కొడుకు. చెల్లెలు మాణిక్యమ్మన్నా, మరిది నరసింహమన్నా ఎంతో అభిమానం ఆవిడకు. అందుకే నరసింహం డబ్బు సంబంధమైనకష్టాల్లో ఉన్నాడని సానుభూతితో అతనికొడుకుని తనయింట్లోనే పెట్టుకుని ఉచితంగా భోజనసదుపాయాలు చేసి, ఆదరించి, తనకొడుకుతో సమానంగా చూస్తోంది. రాధమ్మ యిలా సహాయం చేసే మనస్తత్వం కలదని తెలిసే నరసింహం తన కొడుకును చదువుకుందుకు కాకినాడలో రాధమ్మ యింట్లో వదిలేశాడు.

భర్త చనిపోయి పదిసంవత్సరాలైంది. ఉన్న ఒక్క కొడుకుకు స్నేహంగాఉంటాడని, బుద్ధిమంతుడని ప్రకాశాన్ని తనదగ్గర ఉంచుకుందుకు యిష్టపడింది రాధమ్మ. కాని తన జీవితమంతా భర్తయిచ్చిన పదెకరాల భూమిపైన ఆధారపడాలి. కాని రైతుల అపనమ్మకంవల్ల, ముఖ్యవర్తులు నిర్లక్ష్యంగా వసూళ్లు చెయ్యడంవల్ల ఆమెకు సరిగా ఆదాయం రావటంలేదు. ఇంట్లో గడవటం కష్టంగా ఉంటోంది. అయినా నోటి మంచితనంవల్ల, చుట్టుప్రక్కలవారి సాయంతో, చిల్లర బదుళ్లతో, చాకచక్యంతో సంసారం గడుపుతోంది రాధమ్మ.

ఒకటి రెండుసార్లు నరసింహాన్ని అడిగింది తనదగ్గర మునుపు అప్పుగా తీసుకున్న నాలుగువందలు త్వరలో యివ్వవలసిందని. నరసింహం రేపు యిస్తా, మాపు యిస్తానంటూ కాలం గడిపేస్తున్నాడు. అవసరానికి ఆదుకోకుండా, అప్పు తీర్చకుండా, పైగా అతని కొడుకు తన యింట్లో మేస్తున్నాడనే రోషం కలిగి ఒకటి రెండుసార్లు, నరసింహాన్ని, చెల్లెలును, పిల్లలను, దబదబా తిట్లతో శాపనార్థాలు పెట్టింది రాధమ్మ. స్వతస్సిద్ధంగా అగ్గిలా భగ్గుమని, తరువాత నుసిలా మారిపోయే ఆమె కోపస్వభావం, నరసింహం లేచిపోయాడని వినగానే ఒక్కసారి చల్లారిపోయింది.

చెల్లెలుమీద, నరసింహంమీద అపరిమితమైన అభిమానం ఉప్పొంగింది. 'పాపం! మాణిక్యం ఒక్కర్తె పిలలతో ఏం కష్టాలు పడుతుందో! నరసింహం ఒకవేళ తిరిగివస్తే వచ్చేదాకా చెల్లెలును తనదగ్గరే అట్టే పెట్టు

కుంటే బాగుంటుంది' అని నిశ్చయానికి వచ్చింది రాధమ్మ. ఆ సంతృప్తితో కొంత కుదిరి నిద్రాభారంతో కళ్లు మూసింది.

చిట్టిబాబు రాధమ్మకొడుకు. ప్రకాశం, చిట్టిబాబు ఇంచుమించుగా 12 సంవత్సరాల వయసువాళ్లు. థర్డుఫారం చదువుతున్నారు. రాధమ్మకు మాణిక్యంమీద ఎంత అభిమానమో, చిట్టిబాబుకుకూడా ప్రకాశం మీద అంతఅభిమానం. ఏకైకపుత్రుడుగా చిట్టిబాబు చిన్నప్పటినుంచి అల్లారుముద్దుగా పెరుగుతూ, భోగాలు అనుభవిస్తున్నాడు. చిట్టిబాబు కావాలన్న వస్తువు రాధమ్మ ఏదో విధంగా యివ్వడం పరిపాటై పోయింది.

ప్రకాశం రాధమ్మయింటికి చదువుకుందుకువచ్చి రెండేళ్ళయింది. అతడూ, చిట్టిబాబు మునుపు ఒకరినొకరు బాగా ఎరుగున్నా, యీరెండేళ్లలోనే స్నేహంబాగా పెరిగింది వాళ్లిద్దరికి. నరసింహం జీవితంలో ఎన్నో ఆర్థికబాధలు ప్రవేశించడంవల్ల, ప్రకాశానికి తగినదుస్తులుకూడా కుట్టించే స్తోమత అయనకు లేకపోయింది. ఎప్పుడైనా చిరిగిపోయిన బట్టలు ప్రకాశం కట్టుకుంటూంటే, చిట్టిబాబు అడ్డం తగిలి తన మంచిబట్టలు ప్రకాశానికి యిచ్చేవాడు. తనచేతిలో డబ్బుఉంటే ఎప్పుడూ ప్రకాశానికికూడా ఖర్చుపెట్టకుండా తినేవాడు కాదు.

ప్రకాశంతండ్రి లేచిపోయేడనగానే చిట్టిబాబు అమాయకహృదయంలో పవిత్ర స్నేహంతో కూడిన సానుభూతి పొంగిపొర్లింది. పాపం! ఎంతకష్టం వచ్చింది ప్రకాశానికి! అనుకుంటూ ప్రకాశాన్ని "బెంగపెట్టుకోకురా! మీ నాన్న త్వరలో వచ్చేస్తాడు. అమ్మ చెప్పిందిగా" అంటూ ఓదారుస్తూనే నిద్రపోయాడు.

ప్రకాశం కళ్లు నిగుడ్చుకొని అట్లానే ఆలోచిస్తూపడుకున్నాడు. ఆలోచనల వేడివల్ల నిద్ర పట్టటంలేదు. నాన్న లేకపోతే తనగతి? అమ్మ ఏంచేస్తూందో! తను కనిపించగానే ఎత్తుకుని ముద్దు పెట్టుకుని, కిలకిలా నవ్వించేవాడు నాన్న! భోంచేయగానే తిమ్మిపెట్టి, కబుర్లు, కథలు చెప్పి, తనతో సమానంగా అల్లరిచేసేవాడు. ఏదైనాక్రొత్త సినీమావస్తే తన్ను తప్పకుండా వెంటబెట్టుకుని వెళ్లేవాడు. తీర్థాల్లో, సర్కస్సుల్లో, తనకోసం ఎంతో డబ్బు ఖర్చుపెట్టేవాడు.

సైకిలుమీద కూర్చోపెట్టుకుని సాయంత్రం షికార్లు తీసుకెళ్లేవాడు. అటువంటి నాన్న లేడూ? ఎక్కడికి పోయాడు? దుఃఖం ఆగక వెక్కి వెక్కి ఏడ్చాడు ప్రకాశం.

కాస్సేపయ్యాక దుఃఖం ఆపుకుని ధైర్యం తెచ్చుకున్నాడు. సత్యనారాయణస్వామికి దణ్ణం పెట్టుకున్నాడు నాన్నను త్వరలో యింటికి రప్పించమని. లోపలి బెంగతో నిద్రపట్టక పక్కమీద ఇటూ అటూ దొర్లాడు.

ఎదురుగా టేబిలుమీద ఒక కార్డు పడి వుంది. 'అది అమ్మ వ్రాసిన కార్డా?' అనుకుంటూ ప్రకాశం లేచాడు. గోడకు తగిలించి వెలుగుతున్న కోడిగ్రుడ్డులాంపు దగ్గరగా వెళ్ళాడు, కార్డు చేతపుచ్చుకుని. దస్తూరి చూడగానే 'అమ్మే రాసింది' అనుకున్నాడు ప్రకాశం.

'ప్రియమైన రాధమ్మ అక్కయ్యకు నమస్కరించి మాణిక్యం వ్రాయునది. వారం రోజులనుంచి మీ మరిది కనిపించటం లేదు. ఉద్యోగం తీసేశారని ఊళ్ళో పుకారుగాఉంది. ఆ మధ్య రెండుదినాలు అన్నమైనా సరిగా తినక దిగాలుపడి ఇంట్లో పడుకున్నారు. రెండురోజులక్రితం రాజమండ్రికారు ఎక్కుతూంటే, బండ్రోతు సత్తెన్న చూశానని చెబుతున్నాడు. ఎక్కడికైనా వెడితే నాతో ఎప్పుడూ చెప్పేవారు. మునుపటిలా మీమరిదిఉన్నట్టు కనుపించరు. నాకు బెంగగా ఉంది. ఏంతోచడంలేదు. అక్కడికిగానిక గ్రీటింగుకాదు వ్రాయవలసింది. ముందుగతి ఏమౌతుందో అని పరిపరివిధాల బాధపడుతున్నాను. నువ్వు ఒక్కసారి యిక్కడికి రాగల్గితే నాకు ధైర్యం!'

సోమయాజులు బావతో యీ సంగతి చెప్పవలసింది.

ఇట్లు
మాణిక్యం.

ఉత్తరం పూర్తిగా చదవగానే ప్రకాశం ఒళ్లు దుఃఖంతో జలదరించింది. 'నాన్నా' అంటూ లోలోపల ఏడుస్తూ మంచంమీదకు ఒరిగాడు ప్రకాశం. అని నిశీధంలో, ఏడ్పులో ఆవేదనలో, ఒంటరిగా కుములుతున్న ప్రకాశాన్ని దయతో నిద్రాదేవత ఓదారుస్తూ తనఒళ్ళోకి తీసుకుంది.

* * *

కాకులు కూస్తూంటే మర్నాడు ప్రొద్దున్న రాధమ్మ ప్రక్కమీదనుంచిలేచి, కాలకృత్యాలు తీర్చుకొని, ప్రక్కవీధిలోని సోమయాజులు ఇంటికి, బయలు దేరింది. తెల్లారుఝామునే జపతపాలు పూర్తిచేసుకొని, విభూదిపెట్టుకున్న ప్రశాంతి వదనంతో సోమయాజులు సంచీలో రెండుబట్టలు సర్దుకుంటున్నాడు ప్రయాణసన్నాహంలో. రాధమ్మను చూడగానే సంగతేమని ప్రశ్నించినట్లు ముఖం పెట్టాడు సోమయాజులు.

'మాణిక్యాన్ని పిల్లలతో ఇక్కడకు తీసుకువచ్చేయ్, నరసింహం తిరిగి వచ్చేదాకా నాదగ్గరే వుంటుంది అంది రాధమ్మ.

'అతను ఎక్కడికి వెళ్ళాడో! ఒకవేళ నరసింహం తిరిగి కోటిపల్లి త్వరలోవస్తే మాణిక్యం ఇక్కడవుంటే ఏం బాగుంటుందే!' అంది సీతమ్మ. ఈ పరిస్థితుల్లో కాకినాడ మాణిక్యంవస్తే, ఆమె కుటుంబపోషణ బాధ్యతలు తాముకూడా పంచుకోవాలేమో అన్న అనుమానంతో.

"అది నిజమేకాని, ఒక్కర్తెను అక్కడ విడిచి పెడితే ఎలా?" రాధమ్మకు ఏం పాలుపోలేదు.

'అక్కడికివెళ్ళాక పరిస్థితులుబట్టి ఆలోచించవచ్చు' అని సమస్యకు పరిష్కారం సూచించినట్లు సోమయాజులు తనకి తోచిన ముక్క చెప్పాడు.

"ఒకవేళ రాలేకపోతే, యీ ఏభయి రూపాయలు దగ్గరవుంచుకోమని మాణిక్యానికియియ్యి' అంటూ కొంగుముడివిప్పి, పది ఐదు రూపాయలనోట్లు సోమయాజులు చేతులోపెట్టింది రాధమ్మ.

డబ్బు లేదులేదు అంటూనే అంతసొమ్ము తెగల్గిన రాధమ్మవైపు, సీతమ్మ, సోమయాజులు ఒక్కసారి దిగ్భ్రమచెందిన కళ్లతో చూశారు.

ప్రక్కయింటి వెంకమ్మ గారివద్ద తన యింట్లో వెండికంచం తాకట్టుపెట్టి యీ డబ్బు తెచ్చినవిషయం చెప్పడమెందుకని ఊరుకుంది రాధమ్మ. అసలు రాధమ్మ హృదయమే అంత! ఒకళ్లు కష్టాలలో ఉంటే ఏదోవిధంగా సహాయంచెయ్యాలనే ఆత్రుత ఆమెకు ఎక్కువ.

'రాధమ్మయిచ్చినడబ్బు తీసుకుని సోమయాజులు, బట్టలసంచీ చేత్తో ఊపుకుంటూ, బస్సుస్టాండువైపు నడిచాడు గబగబా, కోటిపల్లికారు బయలుదేరే టైమయిందని.

[ఇంకా వుంది]

భార్యాభర్తలు బస్సులో ప్రయాణం చేస్తున్నారు. ఒక చోటు ఖాళీకాగానే భార్యను నుంచోబెట్టిభర్తకూర్చున్నాడు.

"అదేమిటండి? మీ ఆడవారు పాపం నిలబడిఉంటే మీరుకూర్చున్నారు?"

"అవును. మాఆవిడ నిలబడి ఉంటే ఎవరోఒకరు లేచి జాగా ఇస్తారు. నేను నిలబడితే ఎవరిస్తారు?"

బోడపాటి సుందరి—మద్రాస్.

## విజ్ఞానవీథులు:

# "తెలుగులో ఆధునిక విజ్ఞానం"

## ప్రొ॥ గోపాలకృష్ణమూర్తిగారికి వేమరాజు భానుమూర్తిగారి జవాబు

శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు 27-4-55 వారపత్రికలో వ్రాసిన దంతా శ్రద్ధగా చదివాను. మళ్లీ మళ్లీ నాలుగైదు సార్లు చదివాను.

ముందుగా పాఠకమహాశయుల దృష్టికి ఒక్క సంగతి తీసుకురావడం సముంజసంగా ఉంటుందని భావిస్తున్నాను. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 27-4-55 తేది పత్రికలో చేసిన విమర్శలో భానుమూర్తి రచించిన ఒక 'ప్రపంచం'నుంచి ఒక నెరసు ఏరి చూపించారు. కాని అదే పుస్తకానికి దాదాపు పదమూడు మాసాల క్రిందట వారు పరిచయ వాక్యాలు వ్రాసి ఆ గ్రంథ గౌరవాన్ని ఇనుమడింపచేశారు. 28-4-54 తేదీన వారు వ్రాసిన పరిచయం, అంతనీ యధాతథంగా ఇక్కడ ఉటంకిస్తున్నాను.

"పురోగామి జాతులతో భుజం కలపడానికి విజ్ఞాన పరిశోధన ఎంత అవసరమో, ఆ జాతుల పూర్ణజీవనవిధానాన్ని అందుకోడానికి విజ్ఞాన విస్తృతి అంత అవసరమూను. శ్రీ భానుమూర్తిగారు ఈ సదాశయమును సహస్రవిధాల ఆచరణలో పెట్టుతున్న విలేఖకులు. యోగశాస్త్రమూ, వ్యాకరణ శాస్త్రమూ వలె తీక్ష్ణముగా వుండే విజ్ఞాన శాస్త్రపు వివిధశాఖలను మధురమైన సంభాషణ శైలిలో తెలుగువారి కిచ్చుటకు వీరు విశ్వప్రయత్నము చేయుచున్నారు. 'శబ్ద ప్రపంచము' అను ప్రస్తుత పుస్తకము శబ్ద వైవిధ్యమూ, శబ్దలక్షణములూ, శబ్దప్రయోజనములనుగురించి తెల్పుటకు చేసిన చక్కని యత్నము. ఝరీ వేగముగల తను లేఖినికి మానవ సహజమగు స్త్రీ పక్షపాతము నలవర్చి, అనేక పాశ్చాత్య విజ్ఞాన వేత్తల రచనలనుండి సాధ్యమగు దానినంతటిని గ్రహించి తెలుగువారి కిస్తున్నారు భానుమూర్తిగారు. వారి ఓపికా, విజ్ఞానప్రకాశ తృష్ణా ప్రశంసనీయములు. వీరి వ్రాతలను అర్హరీతిని ఆంధ్ర లోకము సమాదరించుగాక!"

మామూలుగా ఎంతో నిగ్రహాన్ని ప్రదర్శించే శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు ఇప్పుడింగా నా రచనలపట్ల తమ వైఖరిని మార్చుకోవలసినంత వైపరీత్యం ఈ పదమూడు మాసాలలో ఏమి ముంచుకు వచ్చింది?

ఇంకొక సంగతి. ఇప్పుడు తెలుగు వైజ్ఞానిక రచనారంగం 'పట్టి పోరంబోకు భూమి'గావున్నదని కనిపెట్టగలిగిన ధీశక్తిని గలిగి ఉన్నారని వారన్నందుకుగాని, నిత్యనూతనమై, మనోహరమై పల్లు విధాలుగా వికసిస్తున్న ఆధునిక విజ్ఞానం దశదిశలా వెదజిమ్మే దివ్యసౌరభాన్ని దీనిబహుళ ప్రయోజనాలను తెలుగు ప్రజలకు తెలియచేయాలనే ఆకాంక్షతో యధాశక్తి అనవరతం కృషిచేస్తున్నందుకుగాని, భానుమూర్తి వంటి అనధికారులైన యువ రచయితలు బిడియపడవలసింది ఏమీలేదు. ఇప్పటి పరిస్థితిని చూచి నిజంగా బిడియపడవలసింది ఎవరైనా ఉంటే వైజ్ఞానిక శాస్త్రాల బోధనలోనూ, పరిశోధనలలోనూ కృషి చేస్తూ వాటికే జీవితాలనుఅంకితం చేసుకున్న అధికారులూ, పెద్దలూ, అధీతిబోధాచరణ మూలంగా శాస్త్రాధికారం కలిగిఉండి విశ్వవిద్యాలయాల్లో కేవలం తమ విద్యార్థులకు విద్య గరపడంలోనే నిమగ్నులై ఉన్నవారూ మాత్రమే. అంతేకాదు. అలాంటివారు, ఎప్పటికప్పుడు అల్పవ్యవధి, స్వల్ప విరామం; ఇతరపనుల ఒత్తిడి వంటి సాకులతో ఎందరెన్ని విధాల వేడినా, అది తమ పని కాదన్నట్టు ఇంతవరకు ఊరుకోవడం వల్లనే నిజంగా తెలుగువైజ్ఞానిక సారస్వత క్షేత్రం పోరంబోకు భూమిఅయిపోయింది.

ఇంతకీ నిష్ఠురమైన నిజం కొత్తగా కనిపెట్టి లోకానికి చెప్పి ఉద్ధరిస్తున్నామనుకుని వారు ఏదో కొస్త ఉరిమారుకాని అందులో కొత్త ఏముంది? భానుమూర్తి తన లోపాలు ఏమిటో తెలియనివాడు కాడు. తెలుసు. ఆమాట ఎక్కడా దాచలేదు కూడా. మాట వరసకి ఇప్పుడు వారు ఉదాహరించిన ఒక 'కథ'లోను ఒక 'వికాసం' లోను ఒక 'ప్రపంచం'లోను కృతజ్ఞత అనే శీర్షికతో వ్రాసిన క్రింది విషయాలు ఒకసారి చిత్తగించవలసిందని కోరుతున్నాను.

"విజ్ఞానం వికసిస్తున్నకొలది దాని ప్రభావం మన నిత్యజీవితంలో అడుగడుగునా ప్రత్యక్షమవుతున్నకొలది విజ్ఞాన విశేషాలన్నింటిని అందరి అందుబాటులోకి తీసుకురావలసిన అవసరం నానాటికీ హెచ్చుతున్నది.

"విజ్ఞానం అందరి అందుబాటులోకి రాకపోతే జనసామాన్యం అంతకీ విజ్ఞానదృష్టి అలవడనిదే దేశానికి శ్రేయస్సూ, జాతికి ఉన్నతీ ఉండవని నా నమ్మకం. ఇందుకు ఆధునిక విజ్ఞాన విషయాలు, అందరికీ తేటతెల్లమయ్యేటట్టు చెప్పడం అవసరం. ఆ లక్ష్యంతోనే ఈ రచన జరిగింది. ఇందులో ఎంతవరకు కృతకృత్యుణ్ణి అయిందీ నిర్ణయించవలసింది పాఠక మహాశయులే! అయితే నా సామర్థ్య లోపంవల్ల, అందరికీ సుబోధకం కాగల సరియైన వైజ్ఞానిక పదావళి అందుబాటులో లేకపోవడంవల్ల, ఇంకా అనేకమైన ఇతర హేతువులవల్ల, ఈ పుస్తకంలో పూర్తిగా విశదం కానివి, విపులంగా చెప్పనివి అనేక విషయాలు ఉన్నాయి." వారుమాత్రం ఇంతకన్న ఈ సందర్భంలో కొత్తగా చెప్పిందేమిటి?

పైగా యీ విమర్శ యిప్పటివైజ్ఞానిక సాహిత్యరంగంలో అనధికారులైన రచయితలు సాగిస్తున్న కృషిఫలితంగా తప్పతిప్పలుగా కానవస్తున్న ఒకమాదిరి అరాజకలక్షణాలు ప్రొఫెసర్ గోపాలకృష్ణమూర్తిగారివంటి అధికారులలో కలిగిస్తున్న కలవరానికి మంచి నిదర్శనం అని నా అభిప్రాయం. ఇది యీవిధంగా వ్యక్తంకావడం నిజంగా గొప్ప సంగతి. ఇందులో వ్యక్తిగతంగా తీసుకోవలసింది ఏమీలేదు. వర్షాకాలంలో నదులు ఉవ్వెత్తుగా పొంగుతాయి. ఆ వరదలో మంచినీటితోపాటు బురద 'చెత్తా' చెదారం అన్నీ కొట్టుకువస్తాయి. కాని శరత్కాలం రాగానే కలకతేరి నీరు స్వచ్ఛమవుతుంది. అలాగే తెలుగునాట యీనాడు ఉరకలు పరుగులతో పరవళ్లు తొక్కుతున్న వైజ్ఞానిక సాహిత్యవాహినికూడా. దీనికి అడ్డుగట్టు వేయడానికి ప్రయత్నించి ఆ ఉరవడికి నిలతొక్కుకో లేక కొట్టుకుపోవడంకంటె, తూములు తెరచి ప్రవాహాన్ని సక్రమంగా అదుపు చెయ్యడానికి ప్రయత్నించడం మంచిదికాదా!

ఇక నా పుస్తకాలలో వారు చూపించిన తప్పుల సంగతి. "స్వల్పవిరామం", 'అల్ప

 విజ్ఞానవీధులు 

వ్యవధి' అనకుండా పూర్వాపరాలను కలిపి చదివేటయితే అవి నిజానికి తప్పులే కావు. ఈ మాట వారంతటివారికి చెప్పవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను. మండేగాలి విషయంలో సైన్సు కథ 31 వ పేజీలో ఆఖరు పేరాను వారు చదవకుండానే ఇంత తొందరపాటు చూపించడం తగునా? సైన్సు కథ 31 వ పేజీలో ఆఖరు పేరాను పాఠకులు ఈ వివాదంలో తప్పొప్పులు ఎవరివో తమంతటతామే తేల్చుకోడానికి వీలుగా ఇక్కడ పూర్తిగా ఉదాహరిస్తున్నాను.

"మీరు ఏమిటి, "మండేగాలి" నే 'ఆక్సిజన్' అంటారన్నారు. మరి ఇంతవరకూ జరిగిందంతా చూస్తే, ఇనపరజను ద్రావకంలో వేసినప్పుడు వచ్చిన 'వాయువు' లాగా ఇది ఎక్కడా స్వయంగా మండినట్లు కనిపించలేదు. అలాంటప్పుడు దీన్ని 'మండేగాలి" అని ఎందుకన్నాడు." అని పెద్ద సందేహాన్ని వెలిబుచ్చింది సుభద్ర. "ఆ! మరేంలేదు. అసలు ప్రాణవాయువు మండేగాలికాదు. మంటలను బాగా మండించేగాలి అది. అది తనంతతాను ఎప్పుడూ మండదు. కాని మంటలకు బాగా తోడ్పడుతుంది. స్కీలీ పొరపాటున దాన్ని మండేగాలి అన్నాడు. స్కీలీ కథ చెబుతున్నాను కనుక, నేను కూడా కథాసౌలభ్యంకోసం ఆ మాటనే అలానే వాడాను. అందుచేత ఈ అధ్యాయంలో 'మండేగాలి' అని వచ్చిన చోట్లల్లా, మంటలను బాగా మండించే ప్రాణవాయువు అని మనం అర్థం చేసుకోవాలన్న మాట. తెలిసిందా?" అన్నాను నేను. "ఓహో అలాగా?" అంది సుభద్ర.

దీనిని బట్టి గోపాలకృష్ణమూర్తిగారికి ఒప్పులుకూడా తప్పులుగా ఏలా కనపడుతున్నాయో స్పష్టమవుతూనేవుంది. ఆయన ఉదహరించిన ఈ తప్పునుగురించి ఇంతకంటె ఎక్కువ వ్యాఖ్యానించడం అనవసరం.

ఇంక శబ్ద ప్రపంచంలో ఆయన పట్టుకున్న తప్పుసంగతి; ఆ వాక్యానికి సంబంధించిన పూర్వాపరాలనుకూడా ఈ దిగువ ఉదహరిస్తున్నాను.

"అదంతా బాగానేవుంది. ఇంతకీ మనం వింటున్న శబ్దం స్థాయి (పిచ్)ని నిర్ణయించడం ఎల్లాగ?"

**"మనం ప్రయోగించినప్పుడు ఈ ఫోర్కు సెకండుకి ఎన్నిసార్లు కంపిస్తోందో దానిని బట్టి ఈ 'స్థాయి' అనేది నిర్ణయమవుతూఉంటుంది. ఇంక ఈ ఫోర్కులలో రకరకాలుంటాయి. చిన్న రకాలు చాలా గబగబా కంపిస్తాయి. పెద్దరకంవి నెమ్మదిగా మెల్లగా కంపిస్తాయి. సెకండుకు ఎన్నిసార్లు ఇవి కంపించడం జరుగుతుందో దానినే ఇంగ్లీషులో "ఫ్రిక్వెన్సీ"అంటారు. తెలుగులో "పౌనఃపున్యం అనడం సమంజసంగా ఉంటుంది. ఏదైనా ఒక వాయిద్యం పౌనఃపున్యం ఎంత ఎక్కువగాఉంటే, అది సృష్టించగల నాదంకూడా అంత ఎక్కువగా ఉంటుంది."**

"ఇది అర్థం చేసుకోవడం కష్టంగాఉంది బాబూ! మీరు కొంచెం వివరించండి మరి" అంది ఆవిడ.

విద్యార్థులకు విజ్ఞానాన్ని బోధించవలసినప్పుడు అనుసరించవలసిన పద్ధతి ఒకటి, సామాన్య పాఠకులకు సాంకేతిక విషయాలను విప్పిచెప్పవలసినప్పుడు అవలంబించవలసిన విధానం మరొకటి. కాగా శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు ఎత్తిచూపిన ఈ 'తప్పు'లలో నిర్వచనం దృష్ట్యా 'నాదం' అనే పదం యిక్కడ నిర్దిష్టార్థ ప్రతిపాదకమైనది కాకపోవచ్చును గాని, సామాన్య పాఠకులకు అర్థవివరణ చేయవలసినప్పుడు యిది వాడిక తప్పని సుబోధకమైన పదం. పూర్వాపరాలను కలిపి చదువుకుంటే ఉద్దిష్టమైన సంపూర్ణార్థం అవలేశం వ్యభిచారం లేకుండానే తేటపడుతుంది.

మొత్తంమీద చూస్తే ఇందులో అపార్థస్ఫోరకమైనది ఏమీ లేదు. నిర్దిష్టత కొంత కొరవడి వుండవచ్చును కాగా సామాన్యులకు వైజ్ఞానిక శాస్త్రాలను కరతలామలకం చేయదలచుకొన్నప్పుడు, సూత్రప్రాయమైన నిర్వచనాలతో వారిని బాధించేకంటే,

విస్తృతమైన వివరణలతో విషయాన్ని శోధించడమే వాంఛనీయమని ప్రొఫెసర్ గారు సైతం అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

నిజంగా తప్పులైనవాటిని ఎవరు ఎప్పుడు చూపించినా వాటిని వెంటనే సంతోషంతో సవరించుకుంటాను. ఇప్పుడే, కాదు ప్రొఫెసర్ గోపాలకృష్ణమూర్తిగారి వంటి వారు ఏవైనా పొరపాటులను ఎప్పుడు చూపించినా వాటిని గ్రహించి కనీసం మలిముద్రణలో అయినా పూర్తిగా దిద్దుకుంటాను. అలాంటి సహాయం చేయవలసిందనే వారివంటి అధికారులందరికీ నా ప్రార్థన మొదటనుంచీని. చాలా కాలం క్రిందటే అచ్చు అయిపోయి ప్రజలలో బాగా ప్రచారం అయిపోయిన మొదటి ప్రతులను ఇప్పుడు ఉపసంహరించుకోవడం సాధ్యం కాదు కదా అని విచారిస్తూ, మలిముద్రణకు ఆశతో వేచిఉండడం కాక నాలాంటివాడు మరి ఇంక ఏమిచేయగలడు?

వేమరాజు భానుమూర్తి.

---

# దీనికి గోపాలకృష్ణమూర్తిగారి జవాబు

నేను నొక్కి చెప్పిన సంగతులూ వాటికి భానుమూర్తిగారు యత్నించిన సమాధానాలూ వాటి సబబూ వివరించడమే ఈ జవాబులో నేను చెయ్యబోయేది. తక్కిన విలాసపు విసురులు పాఠకులవిచక్షణకే వదలివేస్తాను.

నేను 'ఒక నెరసు' ఏరి చూపించిన వారి శబ్దప్రపంచము నేను ఒకప్పుడు పరిచయ వాక్యాలు వ్రాసినదే అన్నారు భానుమూర్తిగారు. దానికథ ఇది:

అచ్చైన పుస్తకం 'శబ్దప్రపంచం' పట్టుకుని పరిచయము వ్రాయమని నాదగ్గరకి వచ్చారు భానుమూర్తిగారు. "అచ్చు వేసేశారే? దీనిలో మూలపదార్థమే తెలియక చేసినతప్పులున్నాయే. ఈ పుస్తకంతో నా పేరు ఎందుకు కలపగోరుతున్నారు?" అని అడిగినాను. జాలిమొహం పెట్టారు. "దీనికి రాసిపెట్టండి. మళ్లీ ముద్రణలో తప్పులన్నీ దిద్దుకుంటాను" అన్నారు. నాకు వారిని నిరుత్సాహపరచడము ఇష్టము లేకపోయినది. వారు నన్ను అలాగ కోరినప్పుడు ఆ శరణార్థికి చంకదుడ్డు కలదని నేనెరగకపోయినాను. సరే రాస్తానన్నాను. రాసేముందు, 1947 లో నళినీకాంతరావుగారి వివాహోత్సవ సందర్భములో మొదటిసారి ఆయన నన్ను కలుసుకున్నప్పుడు నేను చెప్పిన మాటలు మళ్ళీ చెప్పాను. "మీరు మీకు వచ్చిన విజ్ఞానశాస్త్రములోనే వ్రాయవలెను. అచ్చువేయడానికి ముందు ఎవరేనా అధికారికి చూపి తప్పులు దిద్దించుకోవలెను" అన్నాను. మీరా వాగ్దానము చేస్తేనే రాస్తాను అన్నాను. "ఎంత మాట! మీరు చెప్పేది నా మేలు కోసము కాదా?" అన్నారు. ఆతరవాతే భానుమూర్తిగారు పూర్తిగా ఉదహరించిన ఆ పరిచయ వాక్యాలు వ్రాశాను. వ్రాస్తూ లేఖినికి కళ్లెములు వదలిపెట్టేయలేదు. వారి గుణాల్ని పొగుడుతూ, 'సహస్రవిధాల' 'విశ్వప్రయత్నము' అన్న మాటలు వేశాను. నన్ను కోరినారుకదా అని తెలుగు పాఠకులను భానుమూర్తిగారి రూపాయకు వద్దనిమిదణా లిమ్మనుట న్యాయము కాదుగదా? అందుకని 'చక్కని యత్నము' (విజయము కాదు) "సాధ్యమగు." (ఎవరికి సాధ్యమగు? "వారికి సాధ్యమగు." వారికి అన్న పదము మానుటే మర్యాద. వారెంతవరకు సాధింపగలరు? అన్న ప్రశ్నను పాఠకులలో కలిగించుట 'పరిచయము వ్రాయండి' అని కోరినవారికి ఉపకారము కాదు.) 'వారి "ఓపికా, విజ్ఞానప్రకాశతృష్ణా ప్రశంసనీయములు" (ఓపిక అనంతము. విజ్ఞానప్రకాశ—సంపాదన కాదు - తృష్ణకూడా వారికి ఎక్కువే.) అన్నమాటలు నా అభిప్రాయమునకు అనుగుణముగానే వ్రాసితిని. "ఝరీవేగము" కూడా ఈ విజ్ఞానప్రకాశతృష్ణకు లక్షణమేకదా? వీరి వ్రాతలను అర్ధరీతిని సమాదరించుమనుట చదువరుల మెలకువను రేపుట కాదా? ఈ పరిచయము వ్రాస్తూ పాఠకులకుగాని వారికిగాని అన్యాయముచేసితినా నేను?

ఆనాడు వారి వినయమును బట్టి వారివైఖరి మారదన్న అనుమానము నాకు కలగలేదు. వాటినుంచి నేటికి గాలివానవలె వచ్చేవారి వ్రాతలు చూస్తే "మరి లాభములేదు. వీరికి వ్రాసివేయడములో ఉన్న సరదా నేర్చుకొని వ్రాయడములో లేదు" అనిపించినది. ఆంధ్రపత్రిక వారు కోరినది మంచిదే అనిపించినది. నిర్మొగమాటముగా వ్రాసితిని.

ఆధునిక విజ్ఞానపు "దివ్యసౌరభాన్ని, బహుళప్రయోజనాలను" భానుమూర్తిగారు 'తెలియజే'స్తూంటే సంతోషమే. విమర్శించడము ఎందుకూ? ఆ సౌరభాన్ని అకటా వికటంగా కంగాళీ చేస్తూన్నందుకే విమర్శ. "విజ్ఞానాన్ని ఇవ్వకపోతే మానె. తప్పులు చెప్పకు" మన్నది విజ్ఞానబోధకులకు చెప్పే తొలిసూత్రము. తమకే తెలియదాయె! ఇంకొకరికి చెప్పేయడము ప్రారంభించడము ఏమనిపించుకుంటుందీ?

అధికారము సంపాదించిన పెద్దలు, పూనుకొని వ్రాయడం లేదని అభియోగము తెస్తున్నారు భానుమూర్తిగారు. ఎవరికి విలయినట్లు వారు వ్రాస్తూ వున్నారు. వారు అంతకంటె వ్రాయకేదంటే వారి అవకాశము ఎంతటిదో అనుకోవనము న్యాయముకాని "మీరు వ్రాయడము లేదుగదా నేను వ్రాసేసి విసురుతా" నడము ఎలాంటిదీ?

"భానుమూర్తి తన లోపాలు ఏమిటో తెలియనివాడు కాదు" అన్నారు భానుమూర్తిగారు. ఇది నిజముకాదు. ఏమంటారా? తెలిసీ, లోపాలు చేస్తారా ఎవరైనా? లోపాలు చేస్తున్నానని ఆయనకి తెలిస్తే వాటిని దిద్దించేసిన తరవాతే పుస్తకాలు ప్రచురించేవారు. ముందుగాపత్రికలలో వచ్చిన 'సైన్సు కథ' తిరిగి కూర్పించినారే పుస్తకము కోసము? అయితే పత్రికలో వ్రాసినప్పుడు దొరలిన తప్పులను దిద్దించుకున్న తర్వాతే రెండోముద్రణకి ఎందుకివ్వలేదూ? తప్పులు లేవనా? దిద్దుకోడానికి అతిశయము అడ్డువచ్చుట వల్లనా? చేయవలసిన ఈ పనిని సకాలములో చెయ్యక 'కృతజ్ఞత'లలో అతి వినయముచూపి ఏమి ప్రయోజనమూ?

ఇక నేను ఇక్కడ వ్రాసేది పాఠకుల కోసమే.

'వర్షాకాలంలో నదులు....పొంగుతాయి. ఆ వరదలో మంచినీటితోపాటు బురద చెత్త చెదారం కొట్టుకువస్తాయి...శరత్కాలం రాగానే కలకదేరి నీరు స్వచ్ఛమౌతుం"దని చక్కని కావ్యసామగ్రితో వాదించారు భానుమూర్తిగారు. వైజ్ఞానిక వస్తువును తమ స్వంతముచేసుకోకపూర్వమే పుంఖాను పుంఖాలుగా "బురద చెత్త చెదారం అన్నిటి"తోనూ కలిపి వ్రాసివేయడానికి "ఏమి ముంచుకు వచ్చిందీ?" అని అడుగుతున్నాను.* నేనూ నాకంటె పెద్దలూ మొన్నమొన్నటిదాకా చెప్పుతూండిన సలహాలవల్లనైతేనేం, తమకి తెలియడమువల్లనైతేనేం, శాస్త్రాధికారము సంపాదించిన తర్వాతనే 'నిత్యనూతనమై', 'మనోహర'మైన ఆధునిక విజ్ఞాన సౌరభాన్ని వెదజల్లరాదా? ఆ సౌరభాన్ని ఈ చెత్తయొక్క వాసన పాడుచేయడము

---

* పిల్లలా, వయోజనులా బుర్రలలో ఈ చెత్తా చెదారమూ చక్కగా పట్టుకు కూర్చోదా? దానికి బాధ్యు లెవరు? ఇది విజ్ఞానమునకు సేవయేనా?



మంచిదా? 1947 లో చెప్పినాను నేను వారికి "మీకు వచ్చిన శాస్త్రశాఖలో వ్రాయండి" అని. ఆ మాటలు రెండో చెవి నించి వెళ్లిపోయివుంటాయి. "ఆధునిక విజ్ఞానంలో ఇప్పుడు ఎవరు ఎక్కువగా వ్రాస్తే వారే Pioneer అవుతా"రని వారు వాడు వాతో అన్న ఊహతే వారి మనస్సులో వున్నాయి నాటికీ నేటికీని.

నేను భానుమూర్తిగారి తప్పులను గురించి "ఎంచబోతే మంచానికన్నీ కంతలే" అని చెప్పి ఉదాహరణకుగాను మూడింటిని చూపినాను. దానిలో ఒకటి ఆక్సిజనును 'మండేగాలి' అని వాడడం. ఆక్సిజను మండేగాలి కాదు. (ఉదజని మండేగాలి) కనుక ఆక్సిజనును మండేగాలి అని ఆ అపోహ పాఠకులకు కలిగించడము తప్పు.

దీనికి వారు "ఈ అధ్యాయంలో 'మండే గాలి' అని వచ్చినచోట్లల్లా మంటలను బాగా మండించే ప్రాణవాయువు అని మనం అర్థంచేసుకోవాలన్న మాట" అని 31 వ పుటలో వ్రాసినానే" దీనినిబట్టి గోపాలకృష్ణమూర్తిగారికి ఒప్పులుకూడా తప్పులుగా...కనపడుతున్నాయని "స్పష్ట" మౌతునే వుంది" అంటున్నారు. భానుమూర్తిగారు తమ తప్పును దిద్దుకో నిష్టము లేక ఎలాగో ఒకలాగు సర్దుకోవాలన్న ఆదుర్దాలో తమ సైన్సుకథను వారు చెప్పిన ఆ అధ్యాయందాటి చదవనైనా లేదు. లేకపోతే ఈ అధ్యాయం దాటి 37 పుట 19 వ పంక్తిలోనూ, 'లెవాయిజర్ కథ'లో ఆరవ ('మూడవ' తరవాత రెండు అధ్యాయాలు దాటిన) అధ్యాయంలో 58 పుట 13 వ పంక్తి, 18 వ పంక్తి; 60 పుటలో 9, 10 పంక్తులలోనూ 'మండేగాలి' అని తమ మనస్సులో నిలిచిపోయిన ప్రయోగాన్ని వాడినట్లు ఎందుకు గుర్తించలేదూ? మూడవ అధ్యాయంలో అన్నిమార్లు వాడిన తర్వాత వీరి మనస్సులో ఆక్సిజనుకు మండేగాలి అన్న పదమే నిలిచిపోయింది. ఇక సైన్సు కథను వీరినుంచి చదివి నేర్చుకునే వారికి 31 వ పుటలోని సవరణ అమోఘంగా పని చేస్తుందా? వీరికే పనిచేయలేదు!

నేను చూపిన రెండో తప్పును వివరించడానికి కావలసిన భాగం భానుమూర్తిగారు పూర్తిగా ఎత్తి వ్రాసినారు. రెండు నక్షత్రాల గుర్తులకు నడిమి వాక్యాలు చదవండి. ఐదు వాక్యాలు నడిచిపోయాయి. పౌనఃపున్యం అన్న మాట వచ్చింది. దానితో పాతనీరు కొట్టుకుపోయినది. ఇన్ని పుస్తకాలూ చదివి భానుమూర్తిగారు నేర్చిన సత్యము కలకదేరి స్వచ్ఛమై కనిపిస్తోంది. "ఒక వాద్యంయొక్క పౌనఃపున్యం ఎంత ఎక్కువగావుంటే—" అని వ్రాశారు ఏపాటి జాగ్రత్త కలవారైనా పై వాక్యాలు చూసుకునేనా 'దానిస్థాయి' అన్న మాట వాడతారు. అయితే ఇక్కడ భానుమూర్తిగారి స్వార్జితవిజ్ఞానం వచ్చి చేత్త చేరింది. "నాదం కూడా అంత ఎక్కువగా ఉంటుంది" అన్నారు. నాదం అంటే చెవికి ఇంపుగా ఉండే శబ్దము. "నాదం ఎక్కువగా వుంది" అంటే శబ్దం ఎక్కువగా వుంది అని అర్థము. "ఆ వీణానాదం దీనికంటె ఎక్కువ." "ఆ ఫిడేలులోంచి నాదం ఎక్కువ తీస్తారు" అన్న మాటలు పాఠకులకు కొత్త కాదు. "నాదం ఎక్కువ" అని వినగానే దూరశ్రావ్యత (*loudness*) ఎక్కువ అన్న అర్థము స్ఫురిస్తుంది. ఒక తీగయొక్క కంపన - పౌనఃపున్యం ఎంత ఎక్కువ ఉంటే దానిస్థాయి అంత ఎక్కువగా వుంటుంది. (అంటే కీచుదనం ఎక్కువగావుంటుంది) కాని *loudness* కాదు ఎక్కువగాఉండేది. స్థాయికి కంపన సంఖ్య, *loudness* (దూరశ్రావ్యత) కు కంపన అంతరమూ ఆధారములు. పౌనఃపున్యము ఎక్కువైతే కీచుదనమూ, కంపన అంతరము హెచ్చైతే నాదం ఎక్కువ అవుతాయి. పౌనః పున్యం ఎంత ఎక్కువైతే నాదం అంత ఎక్కువ అనడం అపార్థం కలిగిస్తుంది. రెంటితప్పు. స్థాయి, దూరశ్రావ్యత అన్న రెండు ప్రధానమైన గుణాలే వారి మనస్సులో కలకదేర లేదు! కాని "విమర్శ్య చిత్తినా పూ అంటే, ఏదోగిల్లుతూ నేవున్నా"నంటున్నారు. 'నాదం' వాడకతప్పని సుబోధక పదమట! ఇది సామాన్యపాఠకులకి సాంకేతిక విషయాలను విప్పి చెప్పడమట! సామాన్యులకు వైజ్ఞానిక శాస్త్రాలను కరతలామలకం చెయ్యడమట! భానుమూర్తిగారు గొప్పనిబ్బరము గలవారు మొత్తానికి!

నేను చూపిన 'రెండు నెరసులు' వివరణ అంత బాగా వెలిగినది. మూడోది చల్లగా జారవిడిచారు. ఆ తప్పు అన్వయము కుదరని తప్పు. దానిని భానుమూర్తిగారే, ఎవ్వరి సాయమూ అక్కర లేకుండా దిద్దుకోవచ్చును. కాని వారి విజ్ఞాన ప్రమాద సవరణాతృష్ణకంటె విజ్ఞానప్రకాశతృష్ణ ఎక్కువ. తమ తప్పులు దిద్దుకోడానికి 'టైము' చాలదు ఆయనకు. అంతపాటి అవకాశముంటే మరిఒక వ్యాసము తయారౌతుంది!

ఈనాడు భానుమూర్తిగారికి వారు యత్నించిన వైజ్ఞానికగ్రంథాలు వ్రాయడానికి కావలిసిన విజ్ఞానమూ, బోధనానైపుణ్యమూ, భాషా లేవు. నేను ఎంచబోతే మంచానికన్ని కంతలే అని ఉదాహరణానికి మూడు చెప్పితిని. ఈమూడూ, మరికొన్ని దిద్దుకున్నప్పటికీ వారి రచనలు నిర్దుష్టాలు కాజాలవు. ఏమంటారా తప్పటూహలూ, అయోమయపు వివరణలూ, అర్థసత్యాలూ, సమస్యలచుట్టూ ప్రదక్షిణాలూ పందలకొద్దీ పుటలలోసాగిన కథలలో మాటకేమి, ముప్ఫయి నలభయి పుటల పుస్తకాలకే తప్పలేదు. "విద్యుత్ప్రవాహం అయస్కాంతంద్వారా ప్రసరిస్తుంది"ట. హైస్కూలు విద్యార్థి సైన్సు పుస్తకంలో వుంటుంది విద్యుదయస్కాంతం అంటే ఏమిటో. విద్యుత్ప్రవాహము అయస్కాంతం చుట్టూచుట్టిన ఎనామెల్ రాగితీగద్వారా ప్రవహిస్తుంది. అయస్కాంతానికీ, విద్యుత్ప్రవాహం సాగే తీగకీ "స్పర్శ" లేకుండానూ ఎనామెలు! మరి "అయస్కాంతంద్వారా ప్రవహించడ"మేమిటి? "దయాగ్రం అనబడే

(56-వ పేజీ చూడండి)




# 41

వరదరాజు శివాలయంవీధిలో తాను కొన్న మేడలోకి కాపరం మార్చేశాడు. ముందుగా అతని ఏర్పాటుప్రకారం, ఇనప్పెట్టెని ఓ గదిలో పెట్టి గదికి తాళంవేసి, ఆ తాళాల్ని అడితిలోని ఇనప్పెట్టెలో పడేస్తాడు. తరవాత కనకవల్లిని ఆ ఇంట్లోకి తీసుకెళ్లాడు.

గృహప్రవేశం చేసినరోజు మధ్యాహ్నం టీపార్టీ ఏర్పాటు చేశాడు. టీపార్టీకి అంతా ఏరికోరి శాస్త్రిగారాహ్వానించిన పెద్దలే వొచ్చారు. బ్రహ్మానందం ఏర్పాట్లు చెయ్యలేక సతమతమౌతున్నాడు. ఇల్లు పాతికవేలు చెయ్యదేమో అనిపించింది బ్రహ్మానందానికి. ఇంకా రిజిస్టర్ కాలేదు గనక బేరం పెట్టవచ్చునేమో, పెద్దమనుషులు గనక సమర్థించుకోవచ్చు అనుకుని టీపార్టీ గొడవలో ఒకవేపు నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్న వరదరాజుని పక్కకి పిలిచాడు.

ఇద్దరూ లోపలి గదిలోకి వెళ్లి నిలబడే మాట్లాడుకోసాగారు. బ్రహ్మానందం ఒకసారి చుట్టూ చూసి, "ఈ చిన్న మేడ పాతికవేలు చెయ్యదేమోనండి. పైగా బజారుకి చివర వుంది" అన్నాడతను.

వరదరాజు, "పోనియ్యవయ్యా. వెధవ డబ్బు. వాళ్లు కక్కుర్తి వెధవలయితే, మనం వాళ్ళకోసం మాట తప్పుతామా! పోగొద్దాం మొహాన్ని! అట్లా ఆలోచిస్తే, ఈ టీపార్టీ అంతా దండగ కదూ! ఎవళ్లినా లేనివాళ్లకి ధర్మంచేస్తే బాగుండేది!" అంటూ తిరిగి బైటికి వెళ్లిపోయినాడు.

బ్రహ్మానందం కొయ్యబారిపోయినాడు. ఈ పెద్దమనుషులంటే తన పాడుకొరుకున్న విలువ ఇదా! అంతా విచిత్రంగా వుంది!

ఇంతలో ఆ గదిలో ఏదో సామాను తీసుకెళ్లటాని కొచ్చిన కనకవల్లి గుమాస్తాని చూసి, "ఏమయ్యా! పంతులూ! ఇక్కడ నుల్చున్నావేం, బయట వాళ్లు ఏం కావాలంటారో ఏమో, పో!" అంది, గర్వంగా.

"అల్పుల కధికారమిచ్చిన" అనుకుంటూ బయటికి వెళ్ళాడు బ్రహ్మానందం.

కనకవల్లి టీపార్టీకోసం అలంకారం చేసుకుంది. మొహానికి పౌడరు పూసింది. పెదాలకి తేలికగా ఎర్రరంగు పులిమింది. బుగ్గలకి కూడా ప్రత్యేకంగా రూజ్ వేసింది. ఖరీదైన జరీ అంచు సిల్కు చీర కట్టి, వొంటినిండా నగలు పెట్టి అమ్మవారల్లే తయారయింది. ఆమెని పరీక్షగా చూస్తే, కనిపిస్తున్నదానికన్న ఈడు ముదురని పిస్తుంది. ఆమె గదిలోనుంచి బైటికి వొచ్చేసరికల్లా బైటనించి శాస్త్రిగారు లోపలికి వచ్చారు.

వరదరాజు హాల్లో అతిథులతో మాట్లాడుతూ కూర్చున్నాడు. టీపార్టీసరుకు ఇంకా హోటల్ నించి రాలేదు. మధ్యాహ్నం మూడు గంటలకి టీపార్టీ అప్పుడు రెండున్నరయింది. శాస్త్రిగారు హాలుకీ లోపలి గదికీ మధ్యనవున్న నడవాలో నిలబడి, "ఏం వల్లీ నీ పని బలే జల్సాగా వుంది! ఇంక మనం కనపడతామా!" అన్నాడు సరసంగా.

"శాస్త్రిగారూ! ఇదంతా తమ చలవేగా! నాకిక్కడ బాగానే వుంది గానీండి, ఈ మని షేమిటో అంతా విచిత్రంగా వున్నాడండి..."

"అంతా విచిత్రమే...అదంతా..." అని మెల్లిగా స్వరం తగ్గించి, "పిచ్చి డబ్బు...అదీ ఆ విరగబాటు!......నీకు చెప్పాలీ! ఎంతకాలం వుంటాదో...బాగా డబ్బు చేసుకో!"

ఇంతలో బైటనించి ఎవరో లోపలికొచ్చే పదధ్వని వినిపించింది. శాస్త్రిగారు దల్లగా బైటికి సర్దుకున్నాడు. బ్రహ్మానందం లోపలికొచ్చాడు. "మిమ్మల్ని రమ్మంటున్నారండి" అన్నాడతను కనకవల్లితో.

"వస్తున్నానని చెప్పు" అని కొంచెంసేపు కదుల్తూ బైటికి బయల్దేరింది.

మూడు గంటలకి పది నిమిషాలుండగా టీపార్టీ సరుకు వొచ్చింది వరదరాజు అతిథులందర్ని కూర్చోమని మనవి చేశాడు. కనకవల్లి ఎంతో సిగ్గు నభినయిస్తూ వరదరాజు పక్కనే కూచుంది. బ్రహ్మానందం సెర్వర్స్‌కి ఆజ్ఞలిస్తూ తిరుగుతున్నాడు. ఘుమ ఘుమలాడే నేతి వంటకాలూ, కమ్మని కాఫీ అతిథులను సంతృప్తి పరిచింది. తుదకి అందరూ తాంబూలాలు పుచ్చుకుని వెళ్లిపోయినారు. వరదరాజు అతిథులందర్నీ పంపించేసి, సరాసరి లోపలికి వచ్చి "ఏం వల్లీ! ఇల్లు నచ్చిందా నీకు?" అన్నాడు.

"ఇంటికేం? బాగానే వుంది. ఆ పడమరగది తాళం తియ్యలేదే? అందులో పెద్దమంచం వెయ్యొచ్చుగా!" అంది.

వరదరాజు ముక్కుమీద వేలేసి, "ఆ గదిలోకి పోమాక..." అన్నాడు భయపెడుతున్నట్టు.

ఆమెకి ఇంకా ఆశ్చర్యం ఆసక్తి ఎక్కువైనాయి. "అందులో ఏముందేమిటి?" అని ప్రశ్నించిందామె, వరదరాజు దగ్గరగా వొచ్చి నిలబడి.

వరదరాజు "దేవుడున్నాడందులో...జాగ్రత్త!" అన్నాడు.

ఆమె ఊరుకుంది, ఏదో ఏమిటో అని.

ఆ వేళ రాత్రి వరదరాజు మామూలుప్రకారం, పదిగంటలకి

ఇంటికి వచ్చాడు. అతనికి కనకవల్లి అంటే ప్రేమ ఏ కోశానా లేదు. తన అవసరం తీర్చే వ్యక్తిగా మాత్రమే పరిగణిస్తున్నాడామెను. ఆమె ఏమడిగినా సరిగ్గా సమాధానం చెప్పడు. ఆమె ఏదికోరినా తెస్తాడు. అతని మనస్సు రానురాను మరి ఏదో ఇరుకులో పడుతున్నట్టుంది. ఆవేళగూడా అతను, పూర్తిగా తాగి వచ్చాడు. అయితే అతనిదగ్గిర ఒక్క సుగుణం వుంది; ఎంత తాగినా తూలడు.

అతను ఇంట్లోకొచ్చేవరకు కనకవల్లి గుర్రుపెట్టి నిద్రపోతోంది వొళ్లు తెలియకుండా. పనిమనిషి వచ్చి తలుపుతీసింది. హాల్లో లైటు వెలుగుతోంది. వరదరాజు ఆమెవంక ఒకసారి చూశాడు. ఆమె కళ్ళకింద నల్లటి వలయాలు, పౌడరు పోవటంతో బయటపడినాయి. పగలు మెలుకువతో వున్నప్పుడామె అభినయంలోనూ, అలంకారంలోనూ దాచిపెట్టుకున్న వయస్సు ఇప్పుడు స్పష్టంగా తెలుస్తోంది. ఆమె నా స్థితిలో చూడలేక పోతున్నాడతను. వరదరాజు ఠీవిగా నడిచివచ్చి ఆమె నొక్కసారి గట్టిగా గుంజి నిద్రలేపాడు. ఆమె ఉలిక్కిపడి లేచి కళ్లు నులుముకుంటూ కూర్చుంది. వరదరాజును చూడగానే ఆమె, "ఏంటా మోటతనం, పిలవలేవూ?" అంది కొంచెం చిరచిరలాడుతూ.

వరదరాజు మెల్లిగా నవ్వుతూ, "లే. లే. పోయి మొహం కడుక్కురా! అప్పుడే నిద్రేంది! నాటకమైతే తెల్లార్లూ మేలుకుని వుంటా దెయ్యమల్లే" అంటూ అక్కడ్నించి లోపలి గదిలోకి వెళ్ళిపోయినాడు.

కనకవల్లికి వళ్లు మండుకొస్తున్నది. కాని ఏం చెయ్యడం? ఆమె మొహం చిన్నబుచ్చుకుని, లోపలికి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చింది. వరదరాజు హాలుపక్క చిన్న గదిలో మంచం మీద కూర్చున్నాడు. ఆమె వెళ్లి అతని పక్కనే కూర్చుని, కోపం చూపించి లాభంలేదని లాలనగా ప్రారంభించింది; "మరి మద్రాసుకి ఎప్పుడూ వెళ్ళడం?" అంది.

"ఎందుకూ?" అన్నాడు వరదరాజు సహజంగా.

ఈ తాపీ సమాధానం ఆమెకి ఆగ్రహం తెప్పించింది. "ఎందుకూ అంటావేమిటి? మద్రాసులో కాపరంపెట్టి నన్ను సినీమాలో చేర్పిస్తాననలే మువ్వూ? శాస్త్రిగారెదటే వొప్పుకున్నావుగా" అందామె కొంచెం మొరటుగా, వరదరాజుకి ఎడంగా జరిగి.

వరదరాజు ఏదో వేరే ఆలోచనలో వున్నవాడల్లా నవ్వుతూ ఆమెవంక తిరిగి, "నీకేమన్నా పిచ్చా యేం?" అన్నాడు ఇంకా మామూలుగా.

ఆమె కింకా కోపం ఎక్కువైంది. "పిచ్చా! వెర్రా! సరిగ్గా చెప్పరాదూ!" అంది.

వరదరాజు గది గోడలవంకా, గోడలకున్న పటాలవంకా చూస్తూన్నాడు. గోడలు శుభ్రంగా వున్నాయి. నిన్ననే బ్రహ్మాండం కొనుక్కొచ్చి తగిలించిన దేవుళ్ల బొమ్మలు జాలిగా చూస్తున్నాయి. వరదరాజుకి కనకవల్లి కోపం, నవ్వు తెప్పిస్తోంది. అతను చిన్నగా నవ్వుతూ "సినిమాలో ముసలాళ్ళని చేర్చుకుంటారంటా?" అన్నాడు.

"ముసలాళ్లని ఎందుకు చేర్చుకుంటారు?"

"అందుకనే చెప్పా. నోరుమూసుకునిపడివుండు. ఇక్కడేం? హాయిగాలేదు?" అంటూ పకపకనవ్వాడు వరదరాజు.

"అయితే నేనుముసిల్దాన్నా!..." కోపం పొంగిపొయ్యేసరికి, అదివరకల్లా నటిస్తున్న ఆమె సంస్కారం మాయమై మామూలు ధోరణిలో పడింది. "నీకంటే ముసిల్దాన్నంట్రా? వచ్చినోడా!" అంది.

వరదరాజు, "నాటకంలో వేషం వెయ్యగానే సరిపోయిందీ! ఏళ్లు ఎక్కడికి పోతయి? సినిమా అంటనే సినిమా! ఊరుకుందూ! ఎవరన్నా వింటే నవ్విపోతారు!" అన్నాడు.

"అన్నీ ఉత్తుత్తిమాటలేనా! రేపో మాపో నేనే మద్రాసు పోతా. నువ్వేం రాఖ్ఖర్లేదులే" అంది మండిపోయి.

"పీడ విరగడైపోతుంది" అన్నాడు వరదరాజు. అసలే విసిగిపోయివున్నవాడు, ఈ సంభాషణతో మరింత విసిగిపోతున్నాడు "అర్ధరాత్రిపూట ఏందీ గోల? పగలల్లా తీరికలేదూ? పడుకో — పడుకో. నిద్రవస్తోంది!" అన్నాడతను విరక్తిగా.

"ప్రతీ వెధవా డబ్బుంటే సరి డాబ్బరిమాటలాడుకుంటూ..." అన్నది కనకవల్లి. మాట పూర్తికాకముందె వరదరాజు లేచి చెంపలు వాయగొట్టాడు. ఆమెకళ్లముందు వేసంగి మెరుపులు మెరిశాయి. పటుత్వంజారిన పళ్లు కదిలాయి. ఆమె పరుపుదిండ్లకి జేరగిల పడిపోయింది వెక్కుతూ.

వరదరాజు విసురుగా బైటికి నడిచాడు. ఇంకా అక్కడే వుంటే, తనకోపంలో ఆమెఎముకలు చూర్ణమౌతాయి అనిపించిందతనికి. అత నారాత్రి పదకొండుగంటలవేళ వొణికించే చలినైనా లెఖ్ఖచెయ్యకండా నిదానంగా రోడ్డువెంబడి నడవసాగాడు. బైటికి వచ్చాకగాని అతని మనస్సు స్థిమితపడలేదు. అతనికి వసంతం జ్ఞాపకం వొచ్చింది. వసంతం తనూ ఎన్నిసార్లు తన్నుకున్నా, తిట్టుకున్నా, జీవితం ఇంత దుర్భరంగా ఉండేది గాదనిపించింది...వరదరాజు, పూలచొకుదగ్గిర ఎదురుపడ్డ ఓ రిక్షా ఎక్కి, స్టేషన్‌దగ్గిర ఏడుకొండలు టీ షాపు గుర్తు చెప్పాడు. రిక్షా వేగంగా వెళ్ళిపోయింది.

## 42

రంగయ్యగారిప్పుడు లోలోపల గొణుగుడు మానేసి పైకే అంటున్నాడు. ఆయన స్మృతి మనఃఫలకంమీద వివిధ దృశ్యాలు కనపడుతూంటే బాహ్యస్థితిని మర్చిపోయి వాటిల్లోనే లీనమైపోతూన్నాడు. ఆయన ఉదయం స్నానంచేసి మౌనంగా పూజామందిరందగ్గిర కూచుంటాడు. అది ఆయన అలవాటు. ఆవేళగూడా అలాగే కూచున్నవాడల్లా లేచి ఏదో గొణుగుతూ తడుములాడుతూ ఇంటివెనక దొడ్లోకి వెళ్ళాడు. వరలక్ష్మమ్మగారు వెనకనే వెళ్లింది.

రంగయ్యగారు దొడ్లో మునగచెట్టుకింద నిలుచున్నాడు. పండిన మునగాకులు ఉదయపు ఎండలో బంగారురేకుల్లా మెరుస్తూ చుట్టూ రాలుతున్నాయి. ఆ పక్కనే వున్న బొప్పాయిచెట్టు వెడల్పాటి ఆకులమీద సూర్యకాంతి పచ్చగా జారుతోంది. రంగయ్యగారిని చూస్తూ వరలక్ష్మమ్మగారు గడపమీద నిల్చుంది. రంగయ్యగారు ఏదో ఆలోచిస్తూ నిలబడి వున్నాడు.

"అమ్మా! వొస్తావా?...ఎటా వొస్తావులే? నీకాపురం నీకూ! నాన్న నీకేం చేశాడు! ఏమీ చెయ్యలేకపోయినాడు ... ఇంకా నీరుణంతీర్చి నిన్ను సుఖపెట్టలేకపోతిని ... అమ్మా జయా! నిన్ను ఇక్కడికి రమ్మనటం స్వార్థంకాదా అమ్మా! అయితే నా భాగవతం ఎప్పటి కవుతుందమ్మా! పోనిలేఅమ్మా! భాగవతంలేకపోతే పోయిందిలే..." అంటున్నాడాయన.

ఎవరేమిచెప్పినా వినిపించుకోడు; ఏది ఏమైనా మాట్లాడడు. వేళకి ఏదైనాఇస్తే కొద్దిగా వంజుతాడు. లేదా అడగడు. ఎవర్నీ మీ బాధపెట్టడు.

వరలక్ష్మమ్మగారు కుంగి కృశించిపోతున్నది. ఇటు కొడుకు కూడా సదా ఏదో ఆలోచిస్తూ వుంటాడు. వాడూ సరిగ్గా వుండటంలేదు. ఆమె ఇటు ఈ భర్తతోనూ, అటు ఏదో ఆలోచనలతో సగం బుర్ర చెడిన కొడుకుతోనూ సర్దుకుపోతూ కాలం గడుపుకొస్తున్నది.

మునగచెట్టుకింద రంగయ్యగారు నిల్చునివుండగానే పోస్టు మన్ కేక వేశాడు. వరలక్ష్మమ్మగారు బైటికివెళ్ళి వుత్తరం అందు కుని లోపలికి తెచ్చుకుంది. ఆమెకి తగుమాత్రం విద్య వొచ్చి వుండడంవల్ల ఉత్తరం చదివింది.

శ్రీ రంగయ్య బావగార్కి, శేషాద్రిరావు నమస్కరించి వ్రాసుకొన్నది ఏమనగా, మీరు మా అబ్బాయి పరంగా ఇచ్చివుం చిన ఐదొందల చిల్లరపైకం ముట్టినది. అబ్బాయీ కోడలూ ఇంకో నెలరోజుల తర్వాత అక్కడికి రావాలనుకుంటున్నారు. మీరూ వదానందం అక్కగారూ కులాసాయేనని భావించుచున్నాను. ఇచ్చట అందరూ కులాసా. ఇంతే సంగతులు.

మీ వియ్యంకుడు,
శేషాద్రిరావు వ్రాలు.

వరలక్ష్మమ్మగారికి అంతా అయోమయంగా వున్నది. అల్లుడువొచ్చి వెళ్ళినమాట నిజమేగాని, ఐదొందలు ఎప్పుడు ఎవ రిచ్చారు? అల్లుడు ఆవేళ ఏదో అన్నాడు...అయినా నచ్చేదా?.. ఆమె ఉత్తరం తీసుకుని దొడ్లోకి వెళ్ళింది.

భార్య పదధ్వని రంగయ్యగారికి వినిపించింది. ఆయన మళ్లీ ఏదో ధోరణిలో పడ్డాడు. "ఫైవ్ జీరోమీద రెండు రూపాయలు కట్టితే...ఇవ్వాళ తప్పకుండా బ్రాకెట్ వొస్తుంది...పల్లకొడు వొస్తుంది. వెర్రి! బ్రాకెట్లుకూడా మనకి శత్రువులు. నాబోటి వాడికి వొస్తాయా అవి?" అంటున్నాడు. వరలక్ష్మమ్మగారు దగ్గిర కెళ్ళి ఆయనకి ఉత్తరం వినిపించింది. ఆయన శూన్యంలోకి చూస్తు న్నాడు. భార్య చెయ్యిపట్టుకుని, "లోపలికి రండి! జయ వస్తుం దిట..." అంది.

జయ అన్నమాట మాత్రం ఆయన మసకబారిపోయిన మెద డుకు తగిలింది గావును, "ఏది? వచ్చిందా, నా లక్ష్మి!" అంటూ లోపలికి చరచర నడిచివచ్చాడు.

వరలక్ష్మమ్మగారు ఆయనదగ్గిర కూచుని ఏమేమిటో చెప్పింది. అల్లుణ్ణి గురించీ, బాకీ తీరిపోవటం గురించీ. ఆయన వొక్కటీ విని పించుకోలేదు. మళ్ళీ మొదలెట్టాడు. "శాస్త్రి! భావంటే నీకేం తెలుసునోయ్? తెలుగంటే నీకెంత తేలికైపోయిందోయ్! నాకు కళ్లు కొంచెం మసకబారిపోతేమాత్రం, నేను పిల్లలకు చదువే చెప్ప లేనా? శాస్త్రి! నీవు నాబోటివాణ్ణి తప్ప ఇంకెవర్ని ఏం చెయ్య



# అపస్వరాలు



గలదోయ్? శాస్త్రీ! ఒకరోజైన నువ్వు నాకు తెలుగు సరిగ్గా రాదన్నావుట హెడ్‌మాస్టర్‌తో! బూతులు తప్ప తెలుగున ఇంకేమీ రాని — హెడ్‌మాస్టర్ టోయ్ తెలుగుకు అధికారి?" అంటున్నాడు.

వరలక్ష్మమ్మగారికి వాగుడేమీ అర్థంకావటంలేదు. ఆమె కళ్లుతుడుచుకుంటూ ఓ పక్కన కూచుంది. రంగయ్యగారు వాలు కుర్చీలో కూర్చుని పూజామందిరంలోని కోదండరాముని పటంవేపు చూస్తున్నాడు అంధత్వం ప్రాప్తించిన కళ్ళతో. ఆ కళ్లవెనక వున్న మనఃఫలకంమీద రెండువేపులా ముత్యాల్లా వెలుగుతున్న రెండు దీపప్రమిదలూ, మధ్య నిశ్చలంగా పవిత్రంగా నిలబడి వున్న కోదండరాముడూ కన్పిస్తూనేవున్నాయనకు.

"కోదండరామా! ఏనాడో చేసుకున్న పుణ్యంవల్ల రెండు చర్మచక్షువులూ పోయాయి తండ్రీ! ఈ మాయలోనుంచి బైటపడే మార్గం చెప్పు స్వామీ" అంటున్నాడు రంగయ్యగారు. భర్తతో మాట్లాడ్డం నిరుపయోగం అని ధృవపర్చుకుని వరలక్ష్మమ్మ గారు మామూలు కార్యక్రమంలోకి దిగింది.

ఆవేళ మధ్యాహ్నం సదానందం ఇంటికి వచ్చినప్పుడు తల్లి వియ్యంకుడు రాసిన కార్డు ఇస్తే చదువుకున్నాడు, అతని కెంతో సంతోషంవేసినా, లోలోపల బాధకూడా కలిగింది. "కాకపోతే బావ చెల్లాయిబాధ తప్పించాడుగాని బాకీ బాకీయేగా! ఎన్నటికైనా బావకి మనం ఆ డబ్బు ఇవ్వాల్సిందే!" అన్నాడు సదానందం.

తల్లి "నిజమే బాబూ! నాన్న చూశావా! పొద్దుణ్ణించీ ఒకటే వాగుడు. ఏం చెప్పినా వినిపించుకోటంలేదు! నాకేమో మతి పోతున్నది! ఎవరికన్నా డాక్టర్కి చూపించరా!" అంది కొడుక్కి అన్నం వడ్డిస్తూ.

"అమ్మా! నీదంతా వొట్టి ఆశేగాని, ఆ భ్రమ తొలిగేమార్గం వుందంటావా? నాన్నకి ఇక బాహ్యప్రపంచంతో నిమిత్తం లేదమ్మా! ఆయన..." అంటూ ఆపేశాడు. ఇంక వివరించడంవల్ల ఆమెని బాధాపరచటం అవుతుందేగాని ప్రయోజనం లేదు.

"అంతేనంటావురా! తిరిగి ఆయన మనతో మాట్లాడరూ?" అంది అమ్మ గద్గదకంఠంతో.

"అంతమాత్రానికే దిగులుపడిపోకమ్మా! ఏమో ఎవరు చెప్ప గలరు! ఎట్లా వొచ్చిందో అట్లాగే నయమైపోకూడదా ఏమిటి?"

తల్లి పూరికే విని ఒక్క నిట్టూర్పు విడిచింది. ఏం చెయ్యగలదు? ఆడది!

సదానందం కలతచెందిన మనస్సుతోనే డిస్పెన్సరీకి వెళ్లాడు. అప్పుడు మూడుగంట లవుతోంది డిస్పెన్సరీ ఖాళీగా వుంది. డాక్టర్ పెద్ద ఇంగ్లీషుచుట్ట వెలిగించి కుర్చీలో కూర్చుని, హోమియోపతీ వేదం 'ఆర్గనాన్ ఆఫ్ మెడిసిన్' చదువుతున్నాడు.

కంపౌండర్ డిస్పెన్సరీ టేబిల్‌మీద వున్న సీసాలలోకి చీటీల ప్రకారం మందులు కలిపిపోస్తూ "డాక్టర్ గారూ, ఆ అమ్మాయి వచ్చిందా?" అని ప్రశ్నించాడు.

డాక్టర్ "ఎవరూ? తాసీల్దారుగారమ్మాయా?" అన్నాడు నవ్వుతూ.

సదానందం, "అవును. వొస్తానన్నదండి. వాళ్ళ పిల్లాడికి ఏదో కుస్తీట—మందుకోసం" అన్నాడు.

డాక్టర్ "మంచి కష్టమరేనోయ్ — అట్లాంటి వాళ్ల ఇళ్లకి ఎప్పుడూ డాక్టర్లూ మందులూ అవసరమౌతూంటాయి. కానీ — మంచిమందే ఇద్దాం" అన్నాడు.

పదినిమిషాలైనతర్వాత రోగులు ఒక్కొక్కరే రాసాగారు. చివరికి శ్యామలకూడా వొచ్చింది; మబ్బులమధ్య మెరుపల్లె వుం దామె. ఆమె కొంచెం వొదిగి నిల్చుంది, పిల్లాణ్ణి చంక నేసుకుని.

డాక్టర్ "ఏమిటమ్మా!" అని పలకరించాడు.

శ్యామల, "వీడికండి. జలుబూ దగ్గూ. నా తమ్ముడు" అంది, పిల్లాణ్ణి చూపిస్తూ.

డాక్టర్ ప్రిస్క్రైబ్‌చెయ్యమని సదానందంతో ఏదో మందుల పేర్లుచెప్పి ఇవ్వమన్నాడు. శ్యామల సదానందం ఇచ్చిన పొట్లాలు తీసుకుంటూ, "సాయంత్రం కనపడతారా?" అన్నది.

"ఒస్తా. ఇవ్వాళ టౌన్ పార్టీ మీటింగ్ వుంది. మీతో మాట్లాడి వెళ్తాను" అన్నాడు సదానందం ఆమెని తనివితీరా చూస్తూ.

శ్యామల, "మీరు పార్టీ రాజకీయాల్లో బాగా పాల్గొంటున్నా రన్నమాట!" అంటూ బయల్దేరింది.

సదానందం "ఏమిటోనండి. మనసులకి ఒక్కొక్కప్పుడు మన మేమాత్రం బాధ్యత వహించలేం" అన్నాడు.

శ్యామల వెళ్లాక డాక్టర్ "అయితే సదానందం రాబోయే ఎన్నికల్లో మీ పార్టీఅభ్యర్థులు టౌనంతా నిలబడతారా?" అన్నాడు.

"బలంవున్నచోట పార్టీవాళ్లనే నిలబెడతారట. లేనిచోట స్వతంత్రుల్ని సపోర్టుచేస్తారట."

"ఏమిటోయ్ నువ్వు! నీకేమీ పట్టనట్టే మాట్లాడుతున్నావు దిగతల్చుకున్నవాడికి సముద్రం మోకాళ్లలోతు! దిగినవాడివి ఎటూ దిగావు. సాంతం దిగు. సగంవొద్దూ, సగం నీళ్ళూనా—" అన్నాడు.

"ఏమిటండి మీరు! అంతరాత్మ అంటూ ఒకటి లేదుటండీ? మాపార్టీవాళ్లు నిలబెట్టదల్చుకున్న అభ్యర్థుల లిస్టు చూస్తే మీకే తెలుస్తుంది. అందులో ఒకళ్ళిద్దరు మినహాయిస్తే మిగతావాళ్లందరూ ఏవిధంగానైనా డబ్బు చెయ్యటమే పరమాదర్శంగా పెట్టుకున్న వాళ్లు. మరోకఆదర్శమే లేదు వాళ్లకి. అటువంటివాళ్ళని ఎలా గెలిపించాలా అని ఆశ్చర్యంవేసింది నాకు. కాని, అదీ ఒకతంతే.

వాళ్ళనికాక మరొకర్ని గెలుపుచేసేటట్టయితే — ఇక దీపంపార్టీ లేదు" అన్నాడు యువకుడు బాధపడుతూ.

"అయితే మీ దీపంపార్టీ ఆదర్శాలు ఏమిటంటావు?" డాక్టర్ కొంటెగా ప్రశ్నించాడు.

"ఆదర్శాలకేమండి! లావాటిపుస్తకాల్లో తుంపుడుకాయలంతేసి అక్షరాల్లో అచ్చేసి పంచుతున్నారు; బహిరంగసభల్లో మైకులు దద్దరిల్లేట్టు ఉపన్యసించుతున్నారు. తీరా ఆచరణలోకొచ్చేసరికి డబ్బుముందు అన్నీ మంచులా కరిగిపోతున్నాయి."

"మన్య నికెందుకోయ్ ఈవిమర్శ. నీపని సాగడం నీకు ప్రధానం. పోనీ — నువ్వూ ట్రైచెయ్యకపోయ్యావా ఏదైనా ఓ వార్డులో నిలబడ్డానికీ!" అన్నాడు ఎగతాళిగా.

"డాక్టర్ గారూ! నాకు డబ్బయితేలేదుగాని, ఈపేటలో నాకు చాలామంది పరిచయంవుంది, మీపుణ్యాన; అంతేగాదండి నేనే నిలిచి గెలిచానంటే ఏదో నా చేతయినంత ఉపకారమే చేస్తానుగాని వీళ్ళకి మల్లె అపకారం చెయ్యను" అన్నాడు. అతని మాటలు హృదయంలోనుంచి వచ్చాయి.

డాక్టర్ పెద్దగా నవ్వి, "గొంతెమ్మకోర్కెగాని దీపంపార్టీ వాళ్లు తల్చుకుంటే అదేమంత కష్టం కాదనుకో ... ఏమో మరి, ట్రైచెయ్యి" అన్నాడు.

సదానందం ధీరుడులా నిలబడి, "డాక్టర్ గారూ! నేనెన్నడూ చూస్తూ మూస్తూ దీపంపార్టీ నీడలో నిలబడి గెలవటానికి వొప్పనండి స్వతంత్రంగా నిలబడి వోడిపోయినా వొప్పుకుంటానుగాని!" అన్నాడు.

"సెభాష్! వాళ్ళది పాపిష్టిడబ్బనా నీవుద్దేశం?"

"కాస్తా కూస్తానా! వొట్టి భ్రష్టులుగదండి! నరమాంస భక్షకులైతేనూ! గతిలేక పనిచేస్తున్నానా పత్రికలో" అన్నాడతను. అతని కీమధ్య పార్టీ—పత్రికసంబంధం దగ్గిరైనకొద్దీ— ఆ మనుషుల నిజస్వరూపాలూ మాటలూ బాగా తెలుస్తున్నాయి.

"అయితే నువ్వు ఒకవేళ తెగించి నిలబడ్డా గెలవవు! డబ్బుకున్న అపారమహిమ నీ కింకా తెలీదు. నీప్రత్యర్థి నిన్ను 'ఉఫ్' మని ఊదేస్తాడు తెలుసునా?" అన్నాడు డాక్టర్.

"కాదని నేననను. కాని ..." ఇంకేమనాలో తెలియలేదా యువకునికి. అయినా, తాను అభ్యర్థిగా నిలవడమేమిటి? తన దగ్గిర డిపాజిట్టుడబ్బులుకూడా లేవే?... నవ్వుకున్నాడు సదానందం. "డాక్టర్ గారూ! ఇదంతా పగటికలలెండి. మన కెందుకండి, ఆ ఎలక్షన్‌గొడవ. చెయ్యదల్చుకున్న సేవ ఏదైనావుంటే పైటవుంటే చెయ్యగూడదా! పోనిద్దురూ!" అన్నాడు.

"ఏంసేవ చెయ్యగలవోయ్, రంగునీళ్లు పొయ్యగలవుగాని! రోడ్లు బాగుచేస్తావా? ఈ పేటలో మురికికూపాలు సరిచెయ్యగలవా? వొట్టిమాటలు. అధికారంలోవుంటే ప్రబుద్ధులకి మహాజర్లు పెడతావు?—అన్నీ చక్కగా బుట్టపాలవుతాయి... నువ్వేమీ చెయ్యలేవు!" అన్నాడాయన. ఆయనకి "ప్రజాసేవ" చాలాకాలంనించీ అనుభవం.

"అయితే?"...యువకుడు ప్రశ్నించాడు.

"అయితే?!...మరేమీ లేదు; ఏదోరకంగా నీబాగు నువ్వు చూసుకోవల్సిందే ఈ పరిస్థితుల్లో. అంతకంటే వేరేమార్గం నాకు కనిపించటంలేదు."

"చాలా అన్యాయంగా మాట్లాడుతున్నారండి" అన్నాడు కంపౌండర్.

"అన్యాయమా? నువ్వు అమాయకుడివి కాబట్టి నీ కిదంతా అన్యాయంగా కనపడుతున్నదిగాని, నువ్వు చెప్పిన మనుషుల కివి చాలా సహజంగా తోస్తూంటాయి. నిజానికి వాళ్ళని తప్ప ఇంకేమీ చెయ్యలేమా! ఇంకోటి చూశావూ! అటువంటివాళ్లే గెలుస్తారోయ్. గొర్రె, గొల్లణ్ణి నమ్మదు. కసాయివాణ్ణి నమ్ముతుంది. ఈ ప్రజలూ అంతే. ఈ కసాయివాళ్ళనే నమ్మి వోట్లు వేస్తారు, గెలిపిస్తారు!" అన్నాడు డాక్టర్.

"ఎల్లకాలం సాగుతుందా అలాగ!"

"డబ్బుకి ఇప్పుడున్న విలువ ఇలాగే వున్నంతకాలం, ఈ పరిస్థితి ఇలాగ వుంటుంది నాయనా! మన కెందుకీ తర్కం నీ కళ్ళతో నువ్వు చూస్తావుగా! ఏం జరుగుతుందో? ఎలక్షన్ లింక రెండు నెల్లలో జరుగుతాయి. నీ ఎన్నికల ప్రజాస్వామ్యం పిచ్చి ఆ దెబ్బతో వొదలిపోతుంది చూడు!" అన్నాడు డాక్టర్.

"అయితే ఏదో విధంగా నేను నిలబడి గెలుస్తాను చూడండి. డబ్బుతో నిమిత్తంలేకండా, నా సేవానిరతికే ప్రజలు వోటుచేసేట్టు చూస్తానుగదూ!" అన్నాడు సదానందం, ధీమాగా.

"కల! ముమ్మాటికీ. టెక్నికలర్ కల! అయినా నిన్ను నేను నిరుత్సాహపరచడ మెందుకు? నీ అంతట నువ్వే చూస్తావుగా!"

సదానందం నవ్వి వూరుకున్నాడు.

(ఇంకా వుంది)

# పండ్రెండు గంటల తరువాత

మూలం :
విద్వాన్ కె. నారాయణన్

అనువాదం :
"రవి"

సీతారామన్‌కే అధికారముంటే అంతంతలావు వైద్యశాస్త్ర గ్రంథాలను వ్రాసే వారందరినీ జైలులో పెట్టించేవాడు. డాక్టర్లన్నా, వైద్యశాస్త్రమన్నా అతనికి అరికాలిమంట నెత్తికెక్కుతుంది. కాని యేమిచేస్తాడు పాపం! తనతండ్రి చిదంబరయ్యర్‌కు తనను డాక్టరు చదివించాలనే కోరిక. అందుచేత అతడు యం. బి. బి. యస్. చదవక తప్పలేదు. వచ్చేనెలలోనే పరీక్షలు. సీతారామన్ చదువులో చాల చురుకైనవాడు. అతడు ప్రథమశ్రేణిలో బి. యె. ప్యాసయినాడు. అందుచేత చిదంబరయ్యరుకు సీతారామన్ డాక్టరు పరీక్షలో కూడా ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడౌతాడనే గట్టినమ్మకమున్నది. "అబ్బాయ్! బాగా చదువు. మొదటిశ్రేణిలో మొదటివాడుగా ఉత్తీర్ణుడవు కావాలి" అంటూ సీతారామన్‌ని అప్పుడప్పుడూ హెచ్చరిస్తుండేవాడు.

సీతారామన్ చక్కగా చదువుకోవాలని ప్రయత్నం చేసేవాడు. కాని అతని ప్రయత్నం కొనసాగేది కాదు. దీనికొక కారణమున్నది. గతసంవత్సరమే అతనికి వివాహమైనది. అతనిభార్య శారద కాపురానికి వచ్చిందికూడా. శారద అపురూప సౌందర్యవతి. సీతారామన్ రాత్రి భోజనంచేసి పదిగంటలకు చదువుకొందామని పుస్తకం తెరిచేసరికి అతని కనులముందు శారదరూపం సాక్షాత్కరించేది. తన ధ్యాసను ఆమెపైనుండి మరల్చి చదువుపై లగ్నంచేయడానికి ప్రయత్నించేవాడు. కాని శారద సౌందర్యమే జయించేది. చిదంబరయ్యర్ కోరికేమంటే సీతారామన్ కనీసం పండ్రెండు గంటలదాకా చదవాలని. సీతారామన్ యీ చదువుతో సతమత మౌతున్నాడు. ఒకవంక పాఠ్య పుస్తకాలు, రెండవవైపు శారద సౌందర్యం. తనబాధ తండ్రి కేమర్థమౌతుంది? రాత్రి పండ్రెండు గంటలవరకు తప్పక చదవాలని ఆయనగారి శాసనం. తండ్రిగారి యీ హఠరోగానికి మందేమైనావున్నదా? ఇంతింతలావు వైద్యగ్రంథాలలో హఠరోగానికి మందెక్కడా కనిపించలేదు. బహుశా నాన్నగారు యవ్వనంలో వున్నప్పుడిలాంటి బాధననుభవించి వుండడు. సీతారామన్ విధిలేక పండ్రెండు గంటలవరకు చదువుకొని తరువాత పడకగదిలోకి వెళ్ళేవాడు. శారద గాఢనిద్రలో మునిగిఉండేది. సీతారామన్ తన పక్కపై పరుండి నిద్రపోయేవాడు.

ఆరోజు రాత్రి పదిగంటల సమయం. సీతారామన్ వైద్యగ్రంథాలతో కుస్తీ పడుతున్నాడు. ఇంత జటిలమైన పారిభాషిక పదాలను రాక్షసులు గాని మానవులు వ్రాయరు. వెధవ జలుబున్నదంటే దానికి వందపేజీల గ్రంథమా? ఆ జలుబులో ఎన్ని రకాలున్నవి. అవి ఎలా ఎలా వస్తవి? మనుష్యులనవి ఎలా బాధిస్తవి? ఏ తత్వానికి ఏమందు వాడాలి? మామూలు జలుబుకు యింతగ్రంథమా? వెధవాయలు పనీపాటలూ లేక నాదుంప తెంచడానికి వ్రాసి పారేశారు.

కాలం మెల్లమెల్లగా జరుగుతోంది. పదిగంటలుకొట్టి చాలాసేపైనదే. ఈపాటికి అరగంట కొట్టవలసినదేనే కొట్టలేదేమి చెప్మా. నాన్నగారిగదిలో గడియారం పదిగంటలు కొట్టడం విన్నాడు. అరగంటయెప్పుడు కొడుతుందా అని సీతారామన్ చెవులు నిక్కించుకు కూర్చున్నాడు. కాని యెంతసేపున్నా అర్ధగంట కొట్టదు. అర్ధగంటలుయింత దీర్ఘంగా వుంటయ్యా? అతనికి ఆశ్చర్యమేసింది. బహుశా అరగంటకోసం ఎదురుచూడడంలో విసుగెత్తి అలా అనిపిస్తున్నదేమో?

"ఏమైనా సరే యీరోజు శారదను కలుసుకోవాలి". అనే కోర్కె అతనిలో తీవ్రం కాజొచ్చింది. 'నా భార్య. నేను అగ్నిసాక్షిగా వివాహమాడిన యిల్లాలు. ఈ యింట్లోనే యీ ప్రక్క గదిలోనే వున్నది. కాని ఆమెకూ నాకు మధ్య ఎంత దూరం ఉన్నది? ఎంతవిచిత్రం?. అపురూప సౌందర్యవతియైన భార్య ...పరీక్షలు ... డిగ్రీ ఏది ముఖ్యం?

అతను పుస్తకంమూసి మెల్లగా లేచాడు. శారదవద్దకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. కాని అందులకు మార్గమేది అతనికి కనిపించలేదు. అతను చదువుకొనే గదికి శారదగదికి మధ్య చిదంబరయ్యర్ గది వున్నది. శారద గదిలోకి వెళ్ళాలంటే చిదంబరయ్యర్ గదిలోనుంచే వెళ్ళాలి మరో మార్గంలేదు. చిదంబరయ్యర్ వృద్ధుడైనాడు; అందుచే రాత్రుళ్లు సరిగా నిద్రపోడు. కండ్లుమూసుకొని మంచంలో పడివుంటాడు. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టి చావదు. తెల్లవారఝాము నెప్పుడో కాస్త కునుకుపడుతుంది. అంతే. ఇక నెప్పుడూ మేలుకొనే వుంటాడు.

సీతారామన్ మెల్లగా తండ్రి గదివద్దకు పోయి తొంగిచూశాడు. అతను కండ్లుమూసుకొని మంచంలో పండుకొని వున్నాడు. అతను నిద్రపోతున్నట్లుగా భావించాడు సీతారామన్. చప్పుడు చేయకుండా అడుగులు వేసుకుంటూ అతను తండ్రిగది దాటి శారద గదివద్దకు వెళ్లాడు. ఇంతలో చిదంబరయర్ కనులు తెరచి "ఎవరు సీతారాం! ఇంకా పదిన్నరయినా కాలేదు. పోయి కాసేపు చదువుకో" అన్నాడు.

సీతారామన్ గుండెలు జారాయి. అతని నోట మాట రాలేదు. నాన్న గదిలో యెదురుగా పుస్తకాల రాక్ కనిపిస్తున్నది. రాక్ కనిపించగానే మెలగా తమాయించుకొని "మెడికల్ ఎన్సైక్లోపీడియా కనిపించలేదు నాన్నా! అందుకోసం వెదుకుతున్నా" నన్నాడు.

"ఎన్సైక్లోపీడియా? అది నీపుస్తకాల రాక్‌లోనే వున్నది. నేను మధ్యాహ్నం చూచాను. అక్కడ కనిపించలా?"

"లేదు... కనిపించ... అయినా మళ్లీ పోయి వెతుకుతాను. ఎక్కడికి పోతుంది. బహుశా అక్కడే వుంటుంది" అంటూ తడబడుతూ వెనుదిరిగి తన గదిలోకి వచ్చి 'యిప్పుడేమిచేయాలి' అని ఆలోచింప సాగాడు.

కొంచెము సేపయిన తరువాత తండ్రి గదినుండి గురకలు వినిపింప సాగాయి. సీతారామన్ మరల తండ్రి గదిలోకి తొంగి చూశాడు. తండ్రి నిద్రపోతున్నాడని నిశ్చయించుకున్నాడు. చప్పుడు కాకుండా శారద గదిలోకి ప్రవేశించాడు.

ఇప్పుడొక క్రొత్త సమస్య ఉత్పన్నమైనది. గదిలో గాఢాంధకారం. గదిలో

పెట్టినదీపం బహుశా నూనెలేక ఆరిపోయి వుంటుంది. సీతారామన్ తన్కులాడుతూ శారద మంచంవద్దకు వెళ్ళాడు. శారద గాఢనిద్రలో మునిగి వున్నది. రోజూ పండ్రెండు గంటలవరకూ మేలుకొని వుండే శారద యీనాడు బడలికగావుండి పెందలకడనే నిద్రపోయింది. సీతారామన్‌కి యిప్పుడిదొక సమస్య అయినది. ఆమెను యెలా మేల్కొల్పాలి? ఒకవేళ భయపడి కేకలు వేస్తే? ఏమిచెయ్యాలి?

సీతారామన్ మెల్లగా ఆమె చెయ్యి పట్టుకొని లేపడానికి ప్రయత్నించాడు. శారద ఉలిక్కిపడిలేచింది. ఎవడో దొంగ తనచేతి బంగారు గాజులు దొంగిలించడానికి ప్రయత్నిస్తున్నాడనుకొన్నది. గదంతా చీకటిగా వుండడం, నిద్రలోనుండి గాభరాపడి లేవడం యీ రెండూతోడై ఆమె "దొంగ, దొంగ", అంటూ కేకలు వేయసాగింది. సీతారామన్ అరవబోకు. నేనే నే. సీతారామన్‌ని. నీభర్తను. "అంటూ ఆమె నోరు గట్టిగా అదిమిపట్టాడు. ఆమె ఆపట్టు విడిపించుకొని "అమ్మయ్యో! దొంగలు. నాగొంతుపిసిగి నా సొమ్ములు కాజేయాలని చూస్తున్నారు" అంటూ బిగ్గరగా అరవసాగింది.

"అబ్బా! అరవబోకు. నేనే సీతారామన్‌ని" అన్నాడు.

ఇప్పటికి శారద స్పృహలోకి వచ్చింది. తన తప్పును తాను తెలిసికొన్నది. "అయ్యో! మీరా! గదిలో దీపంలేదు. మీరేమైనా ఆర్పారా? చీకట్లో చెయిపట్టుకుంటే దొంగేమోననుకొన్నాను. ఇవ్వాళ యింత పెందలకడనే వచ్చారేం? ఎన్నిగంటలైన దిప్పుడు?"

"అరవబోకు. నీకేకలువిని అమ్మ వస్తున్నది. నే నిప్పుడెక్కడైనా దాక్కోవాలి. ఎక్కడదాగను?"

శారద కేకలువిని ఆమె అత్త మీనాక్షి అమ్మాళ్ మేలుకొన్నది. ఆమెకు కోడలంటే అమిత ప్రేమ. కోడలికి కించిత్తు కష్టం తగిలినా వోర్చుకోలేదు. లాంతరుతీసుకొని వెంటనే కోడలు గదిలోకి వచ్చింది. సీతారామన్ యెక్కడైనా దాక్కోవాలనుకున్నాడు. కాని యెక్కడ దాక్కోవాలో అతనికి తోచలేదు. టైంలేదు. అమ్మ వచ్చేస్తున్నది. "నా కెక్కడైనా దాక్కోవడానికి చోటుచూపించు" అంటూ భార్య చేతులుపట్టుకొని బ్రతిమాలాడు.

శారద బుద్ధి చురుకైనది. వెంటనే ఈమంచంక్రింద దాగండి. అన్నది. సీతారామన్ వెంటనే మంచముక్రింద దాక్కున్నాడు. సీతారామన్ కనిపించకుండా శారద మంచముమీద పెద్దదుప్పటి నాలుగువైపులా కొంగులు క్రిందకు తగిలేలా పరిచింది.

మీనాక్షిఅమ్మాళ్ గదిలోకి వస్తూనే ఎందుకమ్మా! అలాకేకలు వేశావ్? ఏమి జరిగిందేమిటి అని ప్రశ్నించింది.

శారద అప్పుడే నిద్రలేచిన దానివలె కండ్లు నులుముకొంటూ "నేను కేకలు వేశానా? అత్తయ్యా! అవును. నిజమే. నాకిప్పుడు జ్ఞప్తికివచ్చింది. ఒక పాడు కల వచ్చింది. భయంకరమైన అడవిలో నేను ఒంటరిగా తిరుగుతున్నానట. నాలుగువైపులా చీకటి గాంధాంధకారం - ఒక రాక్షసుడు వచ్చాడు. మిడిగుడ్లు దొప్ప చెవులు. బానకడుపు. వాడిని చూస్తేనే భయంవేస్తుంది యెవరికైనా. నాచేతి గాజులు లాక్కోవాలని చూచాడు. నేను వీలుపడనివ్వలేదు. వాడిబారినుండి తప్పించుకోవడానికై ప్రయత్నించాను. ఇక లాభంలేదని అతను నన్ను ఎత్తుకొని ఆకాశమార్గాని కెగిరాడు నే నతనిచెయి గట్టిగా కొరికాను. చేయి కొంచెము పట్టుతప్పింది. నేను జారి భూమిమీద పడ్డాను. పడి బిగ్గరగా అరిచాను. అంతే" అప్పుడు కన్నులు తెరిచిచూస్తే యేమున్నది. కనుల ముందు మీరు నిలబడి వున్నారు. పాడుకల. యెంత భయమేసిందండీ.

ఇంతటిచక్కని కథ అల్లినందుకు భార్య తెలివితేటలకు లోలోన సంతో[illegible]చాడు సీతారామన్.

"భయపడబోకమ్మా! ఇవాళేదో రాక్షసుని కథ చదివి వుంటావ్! అందుచే కలలో గూడా రాక్షసుడే కనిపించాడు. భయపడకు నామంచంగూడా యిక్కడకే తెచ్చుకొంటాను." అన్నది మీనాక్షిఅమ్మాళ్.

"వద్దు, వద్దు. నాకేంభయం లేదిప్పుడు. మిమ్ములను కష్టపెట్టడం నా కిష్టం లేదు. మీరు వెళ్ళి పండుకోండి. నాకేంభయం లేదు. నిశ్చింతగా నిదురపోతాను."

"ఏమోనమ్మా! నిన్ను ఒంటరిగా పండుకోబెట్టడం నాకిష్టంలేదు. ఈ రాత్రికి నేనుగూడా యిక్కడే పండుకుంటాను.

ఈ మాటకు సీతారామన్ గుండెల్లో రైళ్లు పరుగెత్తసాగాయి. ఆరి భగవంతుడా! ఈరాత్రంతా యీ మంచముక్రిందనే గడపాలి కాబోలు. రాత్రంతా కాదు గదా ఇంక ఒక్క అయిదు నిముషాలున్నా ప్రాణాలుపోయేలా గున్నవి.

ఇంతలో చిందంబరయ్యర్ "ఏమిజరిగిందేమిటి" అంటూ లోపలకు వచ్చాడు.

మీనాక్షిఅమ్మాళ్ శారద స్వప్నవృత్తాంతమంతా తిరిగి ప్రసారం చేసింది. సీతారామన్‌కు మంచం క్రిందనే మటలు పోస్తున్నాయి. ఊపిరాడడంలేదు. ఇంతలో తుమ్మువచ్చింది. హాక్... ఛీ... హాక్ ...ఛీ

చిదంబరయ్యరు, మీనాక్షి అమ్మాళ్ యీ అశరీరవాణిని అదరిపోయారు. కాని అతుమ్ము సీతారామన్‌దేనని తెలుసుకోవడానికి వారికాట్టేసేపు పట్టలేదు. సీతారామన్ యిక దాక్కోవడం వ్యర్థమని భావించి మంచంక్రిందనుండి మోకాళ్లమీద దేకుతూ బయటికివచ్చాడు.

తలిదండ్రులు తిరువురకూ విషయమంతా బోధపడింది. మీనాక్షిఅమ్మాళ్ నవ్వుతూ "నీచేయి పట్టుకున్న రాక్షసుడీతడేనమ్మా?" అని ప్రశ్నించింది.

చిదంబరయ్యర్ కొంచెం కోపాన్ని అభినయించి "పరీక్షలింక నెలరోజులున్నాయ్! పరీక్షలైనతరువాత యిష్టం వచ్చినట్లు అఘోరించవచ్చు. ఇంట్లోవున్న మనిషి యెక్కడకైనా పోతుందా? అలా తొందరపడతావెందుకూ?"

ఈ మాటలతో సీతారామన్ తల తిరిగింది. అతనిలో అభిమానం మొలకెత్తింది. రాత్రింబవళ్లు చక్కగా చదివి పరీక్షకు కూర్చున్నాడు. పరీక్షా పత్రాలన్నీ అతనికి మంచినీళ్ళ ప్రాయంగా తోచాయి. ఫస్టుక్లాసులో ప్యాసవుతాననుకొన్నాడు. ఇంట్లో కాలుపెట్టగానే తండ్రిగదిలో యిలా మాటలు వినిపించాయి.

"పాపం వాడినిరాత్రి పండ్రెండు గంటలదాకా చదివించేవారు. క్రొత్తగా పెండ్లి అయిన క్రుఱ్ఱవాడు పండ్రెండు గంటలదాకా చదవడమంటే మాటలా? మీరైతే అలా చదివేవారేనా. నాబిడ్డ సత్తెకాలపువాడు గనక మీరాడించినట్లల్లా ఆడాడు. ఇంకొకరైతే యీ రోజుల్లో మీ మాట యెవరు వింటారు? పెళ్ళాం బెల్లం తల్లి విషమన్నారందుకే."

"ఒక పండ్రెండు గంటలేమిటి, రెండు గంటలదాకా చదివించాను. పదిగంటలు కొట్టగానే గోడగడియారం తిరగకుండా ఆపేవాడిని. నా చేతిగడియారంలో పదిన్నరకాగానే గోడగడియారాన్ని ఆడనిచ్చేవాడిని. మరల పదిన్నర అయినతరువాత అరగంటకొట్టగానే మరల ఆపేవాడిని. ఇలా గంటకు రెండుగంటలు చేశాను.

అరగంట లంత పొడుగ్గా యెందుకున్నవో యిప్పుడర్థమైనది సీతారామన్‌కు.

కాని తనతండ్రి తన అభ్యున్నతి ఆకాంక్షించే అలా చేశాడని ఆనందించాడు. ★

# దెబ్బతిన్న అహం

**వేదుల మీనాక్షీదేవి**

"అమ్మా, ఎవరండి వంటకు మనిషి కావాలన్నారుట?"

"ఎవరు చెప్పారు మీకు?"

"మంగళాంబగారండి."

"ఔను. నేనే చెప్పాను ఆవిడతో. పండగ నాలుగురోజులుంది. పండగకి ముందు రోజున అమ్మవారి నైవేద్యాలుంటాయి. ఆ రెండురోజులూ వంట చేసిపెట్టాలి."

"ఎంతమందికి వంట? పాతికా? యాభయ్యా?"

'శ్రీదేవి తెలబోయింది.'

"అదేమిటండీ? సంతర్పణ అనుకున్నారా? సమారాధన అనుకున్నారా? మాయింట్లోవాళ్లమే. అంతా మొత్తం అడ్డెడు బియ్యంకంటె అవసరంలేదు. నా ఒంట్లో బాగా లేకగాని నేనే వండుదును" అంది.

"అదికాదుతల్లీ. ఉజ్జాయింపుకోసం అడిగానంతే. మీరు ఎంతమందికి వండమంటే అంతమందికే వండుతాను. మేము ఎక్కడికైనా వెడితే వందల లెక్కని వండడం అలవాటులెండి. ఏ పిండివంటకావలసినా ఒక్కగంట ముందు చెబితే తయారుచేస్తాను" అన్నాడు వచ్చిన అతను.

"ఆ రెండురోజులు వండినందుకు ఏమి కావాలో చెప్పండి" అడిగింది శ్రీదేవి.

"మీకు తెలియనిదేముందమ్మా. ఏదో మీదయ. పిల్లలుగలవాణ్ణి" అన్నాడు.

"అదంతా వద్దులెండి. ఇంత అని మీ నోటితో మీరు చెప్పందే నాకేమి తెలుసు" అంది శ్రీదేవి.

"ఎనిమిదిరూపాయలిప్పించండి" అన్నాడు.

"రెండురోజులకే ఎనిమిది రూపాయలు కావాలా? మరోమాట చెప్పాలిగాని లేకపోతే ఎవరైనా నవ్విపోతారు. న్యాయంగానే చెప్పాననుకుంటున్నారా?" అంది చిత్రపడుతూ.

"అందుకే కదండీ మిమ్మల్ని చెప్పమన్నాను. మీరు తల్లివంటివారు. మీ



ఏకాంతకాంత —చిత్రకారుడు: వడ్డాది పాపయ్య.



## బృంద నాట్యం

ఫొటో: జి. రామమూర్తి—మద్రాసు.

పొలాలదగ్గిర బ్రతకవలసినవాళ్లం. అలాగింటే యెలాగమ్మా?" అన్నాడాయన.

"వేసుక జీతంకాదు. ఇంతకన్న కట్టదు" అని మరోమాట చెప్పండి" అంది శ్రీదేవి.

"ఆరురూపాయలకు తక్కువైతే కట్టదండి. ఎందుకిన్నిమాటలు. తీరా వచ్చాక జీతం కుదరలేదని వెళ్లిపోయే వాడిని కాదు. ఒక్క గంటకష్టపడి యెవరికైనా ఏమిఠాయో యే జిలేబియో మరే పిండివంటైనా సరే చేస్తే ఆరురూపాయలిస్తారు. మీ యింట్లో ఒప్పుకున్నాక యింతకొక యింకో యింత యిస్తామన్నా మరో చోటికి పనికి వెళతానా? రోజంతా మీ యింట్లో పని కోసమే వుండిపోతాను. పండగరోజులలో రోజుకి మూడు రూపాయలకి తక్కువ యెవరూ ఒప్పుకోరు. తమరివన్నీ ఆలోచించండి. ఏదో పిల్లలు గలవాణ్ణి" అన్నాడు.

అతనన్న మాటలలో అసహజం కాని, అబద్ధం కాని ఏమీ కనబడలేదు. శ్రీదేవికి పదేపదే "పిల్లలు కలవాణ్ణి" అనడంతో జాలి వేసింది. ఇంట్లో తినేపిల్లలున్నప్పుడు తగిన ఆర్థికస్తోమతు లేకపోవడం అంతబాధ అకేగాని మరొకటి లేదు! బిడ్డలు లేక ధనవంతులు తపస్సులు ధారపోస్తున్నారు. పుట్టకు ధనెత్తుతున్నారు! లక్షలు, కోట్లువచ్చే సంస్థానాలు ఒక్క వంశాంకురం లేక అన్యాక్రాంతం అయిపోతున్నాయి! గర్భదరిద్రుడికి బోలెడు సంతానం. దేవుని మహిమ విచిత్రం!—అనుకుంది శ్రీదేవి.

"అమ్మా సెలవా?" నమస్కరిస్తూ అన్నాడాయన.

"సరే మీరన్నట్లే యిస్తాను. మీ పేరు?" అంది శ్రీదేవి.

"శివయ్య అంటారు. వెళ్లొస్తానమ్మ" అంటూ శివయ్య వెళ్లిపోయాడు.

భార్యాబిడ్డలు పాపం నాలుగురోజులు సుభిక్షంగా తింటారు ఆ ఆరు రూపాయలతోను. రెండురోజులపాటు వండిపెడితే తనప్రాణం సుఖపడుతుంది. "ఏకక్రియా ద్వ్యర్థకరి" అనుకుంది శ్రీదేవి.

శ్రీదేవికి ఆరుగురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. మగపిల్లలంతా స్కూళ్లకు, కాలేజీలకు వెళ్లేవాళ్లు. ఆడపిల్లలు ఆఖరివాళ్లవటంవల్ల ఆ తల్లికి పిల్లలసాయం కించిత్తు కూడా లేదు. ప్రొద్దున్న లేచింది మొదలు రాత్రి పడుకోబోయేవరకు వంచిన నడుము యెత్తకుండా సరిపోతుంది. ఏ కాలం తొమ్మిదోగంటకి పిల్లలను బడులకి, భర్తను ఆఫీసుకి పంపాలి భోజనాలు పెట్టి. ఉదయం ఆరుగంటలకి కాఫీ యిస్తుంది. ఇటు అందరికి నీళ్లు ఇయ్యాలి స్నానాలకి. పనిమనిషి తోడితే వాళ్లకి అసహ్యం. అటు వంట చేసుకోవాలి. లేచిననాడూ లేవనినాడూ అదే కార్యక్రమం. అటు సూర్యుడిటు పొడిచినా శ్రీదేవి పనులు యథాప్రకారంగా జరిగితీరవలసిందే! పోనీ ఆదివారం సెలవు అందరికీ! ఆనాడు కొంచెం ఆలస్యంగా లేవవచ్చు. మునిగిపోయిందేముంది? కాఫీ, భోజనం మామూలుకంటే ఒక్కగంట ఆలస్యం అవుతుందంతేకదా అనుకుంటుంది శనివారం రాత్రి.

భర్తకి ఆదివారం తప్పితే మరి శెలవుండదు. ఏపనులున్నా, ఏవూరు వెళ్లవలసివచ్చినా

ఆఫీసుకే వెళ్ళాలి. ఉదయాన్నే వెళ్ళి సాయంత్రానికి వస్తాడు. అవొక్కపూటకీ. స్నానం చెయ్యడానికి ఒకపంచ, తువ్వాలు పట్టుకుని వెళ్ళాలి. తడిసినపంచ, తువ్వాలు ఆరే వ్యవధివుండాలి. కాని ఆవ్యవధి ఏది? ఆ ఇబ్బందులు లేకుండా ఇంట్లోనే స్నానం



చేసి వెడతాడు. ఇంకేం! శ్రీదేవి సెలవు దినపు ప్లాను కాన్సిల్! ఆదివారంనాడు మామూలుకంటె ఒక అరగంట ముందుగానే లేచి భర్తకి వేడినీళ్ళు స్నానానికి యిచ్చి, కాఫీయిచ్చి వూరికి పంపుతుంది. అదిమొదలు దినచర్యప్రారంభం. అలాగని ప్రతీవారం వెళ్ళడు. ఒక్కొక్కప్పుడు వెడుతూంటాడు.

ఆదివారం అందరికీ శెలవయితే శ్రీదేవికి పనిరద్దీరోజు. అందరూ యింట్లో వుండేరోజు. ఆనాడు వాళ్ళకి తలంటినీళ్ళు పొయ్యకపోతే మళ్ళీ వారందాకా తీరిక దొరకదు. అందుచేత అందరికి ఆవ్వాళ తలంటినీళ్ళు పోసితీరాలి. మధ్యాహ్నం అంతా యింట్లోవుండడం ఆనాడే. మిగిలిన రోజులలో ఫలహారం చెస్తే అంతా సాయంత్రం దాకా యిల్లుచేరుకోరు. అప్పుడు ఫలాహారం చేస్తే రాత్రికి భోజనాలకి స్వస్తీ. ఆకలివెయ్యదు. అందుచేత ఆదివారం తప్ప ఫలహారం చెయ్యడానికి అనువైనరోజు లేదు. ఆ విధంగా అందరికీ శెలవు దినమైన ఆదివారం శ్రీదేవికి గడ్డురోజుగా తయారవుతుంది. ఎవరో ఒకరు వచ్చేపోయేకొంప.

ఇదీ ఆమె నిత్యజీవితం. వెనకటి ఓపిక, పనిలో వుత్సాహం తగ్గింది క్రమంగా. ఆ ఉగాదికి వంటమనిషి వస్తాడు. తను వంట చేసుకోనక్కర్లేదు. అందరికీ సావకాశంగా నీళ్ళు పోసుకుని అవతలపనులు చూసుకోవచ్చు. ఈమారు ఉగాదిపండగ తనకి పండగే నిజంగా. ఇదివరకు దాకా పండగలు వచ్చాయంటే తను వంటింట్లో కూరుకుపోవడమే కదూ? అనుకుంది శ్రీదేవి.

బేరం కుదిరాక అడ్వాన్సుగా ఒక రూపాయి పట్టుకుని వెళ్ళాడు శివయ్య.

ఉగాదినాడు ఏమిజరిగితే ఆ సంవత్సరమంతా అలాగే జరుగుతుందని అందరికీ ఒక నమ్మకం. అందుకే పనివాళ్ళు, అమ్మకాలవాళ్ళు అంతా ఆనాడు తలంటినీళ్ళు పోసుకుని వారి వారి వ్యాపారాలలోకి వెళ్ళిపోతారు. ఆ సంవత్సరం అంతా తమకు పనివుంటుందట. అలాగే తనకు వంటకి మనిషి కుదరడం వల్ల పండగరోజున శ్రమలేకపోవడమే కాక ఆ ఏడాదంతా భగవంతుడు సుఖాన్నే ప్రసాదిస్తాడు. ఈ ఆలోచనలతో పొంగిపోయింది శ్రీదేవి. భర్తతో చెప్పింది.

“పెడితే పెట్టావుకాని ఎరగనివాడికి రూపాయిచ్చావుకదా. వాడు మళ్ళీ నీకు కనబడతాడా” అన్నాడు రాఘవరావు.

“ఇంకా నయం. మంగళాంబగారు పంపారు” అంది శ్రీదేవి.

“మంగళాంబగారు వచ్చినీతో చెప్పారా అతనిగురించి?”

“లేదు. ఆవిడ పంపారని చెప్పాడంతే”

“అయితే అతని మాట నమ్మి ఇచ్చావన్నమాట!”

"ఒక్క రూపాయికదా! అబద్ధమాడితే ఎక్కడైనా మళ్లీ పనిదొరుకుతుందా అతనికి?" అంది శ్రీదేవి.

"ఎన్ని సంగతులు వినడంలేదు మనం. మన పక్కింటి ప్లీడరుగారింటికి ఒకడు వచ్చి ప్లీడరుగారు కోర్టులో వున్నారు. గోడగడియారం యిమ్మన్నారన్నాడు. వీధిగుమ్మం దగ్గిరవున్న ఆయనబోర్డు చూడ్డంచేత ఆ ప్లీడరుగారి పేరుకూడా చెప్పగలిగాడు. అంతచెప్పాక నమ్మకపోవడం ఎలాగ? ఆవిడ గోడగడియారం తీసియిచ్చింది. నాటికీ, నేటికీ వచ్చాడా?" అన్నాడు రాఘవరావు.

శ్రీదేవి తెల్లబోయింది. నిజమే! ఎవరో తెలియకుండా యివ్వడం తప్పే. కొంపదీసి పోడుగదా ఆ శివయ్య? పోనీ తన భర్త అయినా చూసివుంటే ఏ బజారులోనైనా కనబడితే గుర్తుపట్టి అడుగును. కాని ఆయన శివయ్యను చూడనేలేదే! అంతా తనే కుదిర్చిందాయె! నూటికో, కోటికో ఏ పేరంటానికైనా వెళ్ళవలసివస్తే కొంప లోంచి కదలడానికి బ్రహ్మప్రళయం అయే టప్పుడు తానై వూరంతా ఆగమ్మ కాకిలాగ తిరిగే శివయ్యను కనుక్కోగలదా? ఎప్పుడూ స్వతంత్రించి నీ వ్యవహారంలోను జోక్యం కలుగజేసుకోని తను శివయ్యని కుదర్చడం విషయంలో యెందుకు కలుగచేసుకున్నట్టు?

తెల్లవారితే యిలాంటి రూపాయిలెన్నో ఖర్చు అవుతాయి. పోయినావున్నా అయిదు కాదు పదికాదు. ఒక్క రూపాయి. ఒక్కనాడు పిల్లలు కొనుక్కున్నంతలేదు. "భర్త తిట్టినందుకు కాదు. తోడికోడలు చెప్పినందుకన్నట్టు రూపాయిపోయిందని కాదు. "భలేబేరం" అని అంతా హేళన చేస్తారేమోననీ ఆవిడ బాధ. అభిమానస్తురాలైన శ్రీదేవికి చాలా బాధగా వుంది.

"పోనిస్తూ పోతే పోయింది. ఇంతకీ పోలేదు. పూరికే అనుకున్నాం అంతే. మంగళాంబగారు చెప్పకపోతే ఆయన కేం తెలుసు మనకి కావాలని? ఆయనే వస్తాడు? ఒకవేళ రాకపోతే పోయేది ఒక్క రూపాయి. అనవసరంగా బాధపడకు" అన్నాడు రాఘవరావు.

"అంత వూహయెందుకులెండి. ఇప్పుడే కనుక్కుంటాను" అంటూ నాలుగోకుర్రాడిని పంపి కనుక్కుంది. మంగళాంబగారు పంపిందట. శివయ్య పండుగలలో కావలిస్తే యెప్పుడైనా పిండివంట చేసి పెడుతూంటాడువిట వాళ్లింటికి వచ్చి. ఆయన రావడమే గాని యిలుమాత్రం ఆమెకు తెలియదట. కాని శివయ్య మంచి నమ్మకస్థుడని మంగళాంబగారు కబురుచేసింది.

"అమ్మయ్య" అనుకుంది శ్రీదేవి. శివయ్య మోసం చెయ్యడు. స్వతంత్రంగా వ్యవహరించినందుకు మోసపోలేదని ఆమె తృప్తి పడింది.

"ఎరగనివాడిని వంటకు రమ్మంటే వాడికి వచ్చునో రాదో వంట? పిండివంటలే కాని వంట చెయ్యలేడేమో కనుక్కున్నావా" అన్నాడు రాఘవరావు.

"ఇంకొనయం రాకపోతే రాదని చెప్పడా? వస్తానని యెందుకు ఒప్పుకుంటాడు" అంది శ్రీదేవి.

"చేతకానివాళ్లైనా చేతకాదని చెబుతారా? ఏకాస్తో పోగలో వండిపారేస్తే ఆరురూపాయలూ చేతులోపడతాయని ఆశ చేత చేతకాకపోయినా వొప్పుకుంటారు" అన్నాడు రాఘవరావు.

"ఏదో పాపం బీదవాడు. అతని వాలకం, బట్టలూ చూస్తే నాగుండె తరుక్కుపోయింది అతనిబీదదశకి" అంది శ్రీదేవి.

"అయితే ఓ గ్రంధం మంగలి కాదుకదా కొంపముంచి?" అంటూ రాఘవరావు వీధిలోకి దక్కోబోయాడు.

శ్రీదేవికి ఇదొకసమస్య కొత్తది వుత్పన్నమైంది. ఓ గ్రంధం మంగలిఅయితే మంగళాంబగారు పిండివంటలు ఎలా చేయిస్తోంది. భర్త మాటవరసకి అన్నమాటగాని నిజంగా కాదని ఆమెకు తెలుసు. కాని, శివయ్య వాలకంమాత్రం అలాగే వుంది. నీరుకాసులు పట్టేవాడిలాగ, శివవాహకుడిలాగ, నీళ్లబిందెలు మోసేవాడిలాగ వున్నాడు కాని, వంటచేసేవాళ్ల లక్షణాలు కన్నపొడుచుకున్నా కనపడలేదు. ముఖాన వర్చస్సు లేదు. పోనీ వర్చస్సుతో పనేమిటి? వంటేనా చేతనైతేసరి. గొడ్డుతోళ్లవంటి బట్టలు అవ్వాళ కట్టుకున్నాడుగాని పనిలోకి వచ్చేటప్పుడు పరిశుభ్రమైనవి యెందుకు కట్టుకోడు? ఏదో ఆరెండుగోజులూ కష్టపడక్కర్లేదు అని సమాధానపరచుకుంది శ్రీదేవి.

* * *

"అమ్మా, రేపు యెన్నిగంటలకి రానండి? తెల్లవారుఝామున నాలుగుగంటలు కొట్టాక రావచ్చాండి?"

మొన్న వుదయంవచ్చిన శివయ్యగారే! అడగడానికి వచ్చాడు. మొన్నటికన్న మాసినబట్టలు, గడ్డము ముఖం కప్పేసింది. చూసింది శ్రీదేవి. అతన్ని చూసి తనపిల్లలు జడుసుకుంటారేమోననిపించిందామెకు.

"శివయ్యగారూ ఏమిటీవాలకం? ఆ గుడ్డ లేమిటి? ఈ కుళ్లుగుడ్డలతో వండితే ఎవరైనా తినగలరా? రేపు యీ బట్టలతోనే వస్తారా? శుభ్రమైనవి కట్టుకుంటారా? ఇలాంటివి ఒకళ్లు చెప్పాలా? మీకు తెలియక్కర్లేదుటయ్యా?" అని అడిగింది.

"ఈ బట్టల్తో యెందుకు వస్తానమ్మా? ఈ కండువా ఉతికి ఆరవేసుకుని వస్తాను. నా ఫైనాన్షియల్ సర్కమ్‌స్టెన్సెస్ (నా ఆర్థిక పరిస్థితులు) వల్ల యీ బట్టలుకట్టుకోవలసి వచ్చింది. ఎన్నిగంటలకు రమ్మన్నారో చెబితే సరిగ్గా ఆవేళకు వస్తాను" అన్నాడు.

"అవునుగాని అసలు మీకు వంట చేతనౌనో, లేదో అని సందేహంగా వుంది.

#  దెబ్బ తిన్న అహం 

వంట బాగా లేకపోతేమాత్రం మా చిన్న పిల్ల కూడా తినదు సుమండీ! ఏ పూట వంట బాగా లేకపోతే ఆ పూట మానిపించేస్తాను. రేపు ప్రొద్దున్న అయిదయే సరికల్లా రావాలి. ఆరుగంటలకు కాఫీ, ఫలహారం, పదిగంటల కల్లా భోజనాలు అయిపోవాలి. ఏమాత్రం ఆలస్యం కాకూడదు. పిల్లలు వుండలేరు" అని చెప్పవలసినదంతా చెప్పేసింది.

"అలాగేనమ్మా" అంటూ సెలవుతీసుకున్నాడు శ్రీదేవివద్ద శివయ్య.

శివయ్య వుతికి కట్టుకుని వస్తానన్న కండువా పంచకన్న తోలులాగ వుంది. చాకలి వుతికినా తెలుపురావడంకల్ల సరిగదా మురికైనా పోతుందా అని సందేహం. అలాంటప్పుడు అతనికి లొంగుతుందా? అదే తప్ప మరోటి లేదన్నమాట! అదే శరణ్యం!

తను తప్ప ఎవరు వండినా సరిపడని తన భర్త తను పదే పదే "వండలేను" అని చెబుతుంటే "పోనీ వండించుకో" అన్నాడేగాని, శివయ్య వాలకం చూస్తే అతనింట్లో వుండగా మంచినీళ్లుకూడా త్రాగుతాడని ఆమెకు నమ్మకం కలగలేదు. పండగ రోజులలో లంఖనప్రాయంగా తినడమా తనభర్తకి? అది పండగ అనిపిస్తుందా? అంత వరకు యెందుకు? తనకే రోత! పిల్లలు ఆ చుట్టుపట్లకే రారు భయంచేత! "ఛీ! ఎరక్క పోయి చెప్పాను. రూపాయిపోతేపోయింది. బీదవాడు. కుటుంబీకుడు. తింటే తిన్నాడు. ఓపిక లేకపోతే ఒక్క వస్తువే చేస్తాను. కాని దిక్కుమాలిన శివయ్యనుమాత్రం వంటకు రానియ్యను" అని నిశ్చయించుకుంది శ్రీదేవి

.........

"మాపిన్ని యీరాత్రికి వస్తానంది. ఇప్పుడే వుత్తరం వచ్చింది. శివయ్యగారికి కబురు చెయ్యండి "మీ నౌకరుచేత" అని కబురంపిద్దా మనుకుంటోంది మంగళాంబ గారికి శ్రీదేవి.

* * *

"శివయ్యగారు ఊరికి వెడుతున్నారుటండి అర్జంటుపనిమీద. మీరిచ్చిన అడ్వాన్సు రూపాయి యిచ్చేశాడు. ఇదిగో రూపాయి" అంటూ మంగళాంబ గారి నౌఖరు రూపాయి నోటుయిచ్చి వెళ్లాడు.

ఆ రూపాయినోటు చూసి శ్రీదేవి నిర్విణ్ణురాలైంది. శివయ్య రూపాయి పంపకపోతే బాగావుండేది. రూపాయి పంపడం తన అహంభావానికి గొడ్డలిపెట్టు అనిపించింది. తనకు బుద్ధివచ్చేటట్టు చేశాడు. ఎంత పని చేశాడు! పాపం తను అన్న మాటలకు ఎంత బాధపడ్డాడో! అవమానపడ్డాడో! బట్టలు మాసే యేం? శివయ్య మనస్సు నిర్మలమైంది. విలువగల వస్త్రాభరణాలు కలిగి ఐశ్వర్యంతో వున్నా తన మనస్సు స్వార్థం, కుచ్ఛితం, పరనిందతో కూడివుంది. పేద వాడుకదా అని తూలనాడింది. కాటికి పేదఅయితే కులానికి పేదా? బీదవాడయినా సాటివాడు! తన తప్పిదాన్ని భగవంతుడు క్షమించడు. "పేదవానికోపం పెదవికి చేటు" తను ఎంతో యీసడింపుగా అన్నమాటలన్నీ తలవంచుకుని విన్నాడు. అయితేమాత్రం ఏమి చెయ్యగలిగాడు? ఎగుడు సమాధానమైనా చెప్పలేదే? బాధ లేకనా! ఎంత బాధ కలగకపోతే ఆరు రూపాయల బేరం వదులుకుంటాడు!

శ్రీదేవికి శరీరమంతా తేళ్లు, జెర్రులు పాకుతున్నట్లు అనిపించింది.

"శివయ్య ఉత్తముడు. అట్టివాని మనసు కష్టపెట్టాను. అతని మనస్సు నిష్కల్మషమైనది. నా మనస్సు మురికిది. బొగ్గులలోని మాణిక్యంలాంటివాడు మాసిన బట్టలలోని శివయ్య. ఎదుటివాళ్ళ మనస్సుకి నొప్పి కలిగించేటట్లు మాట్లాడే నాకు గట్టి గుణపాఠం నేర్పాడు శివయ్య. అభిమానస్తురాలిని నేనే అనుకునేదాన్ని. అభిమానమనేది ధనిక దరిద్ర భేదములు లేకుండా అందరికి వుంటుందని యీనాడు గ్రహించగలిగాను."

పెద్ద నిట్టూర్పు విడిచింది శ్రీదేవి.

"ఫైనాన్షియల్ సర్క్యుమ్‌స్టెన్సెస్ వల్ల యీ బట్టలు కట్టుకోవలసి వచ్చింది" అన్న శివయ్యమాటలు గింగురుమంటూ అదే పనిగా వినబడుతూ శ్రీదేవి మనస్సును మరింత ఆందోళనపరుస్తున్నాయి

"పాపం చదువుకున్నవాడల్లే వుంది. ఇంగ్లీషుమాట వుపయోగించాడు!! అన్నట్లు శివయ్య బోర్డుస్కూల్లో పని చేసేవాడనీ ఆ జీతం చాలక యీ వృత్తిలోదిగి వుద్యోగం వదులుకున్నాడని మంగళాంబగారు చెప్పారు! బంధువుల యిళ్ళల్లో గాని, ఏ పాటి పరిచయం వున్న వాళ్ళిళ్ళల్లోనైనా గాని పనికి వప్పుకోడని కూడా చెప్పిందావిడ! సాటివాడేకాక విద్యావంతుడు కూడాను! ఇది ఘోరాపరాధం! ఈ పాపానికి ప్రాయశ్చిత్తం లేదు!" శ్రీదేవి పడుతున్న బాధంతా చివరికి దుఃఖరూపం పొందింది. రూపాయి నోటు చేతిలోంచి జారి క్రిందపడిపోయింది. శ్రీదేవి పక్కనేవున్న పడక కుర్చీలో కూలబడింది. కళ్లవెంబడి నీళ్ళు చెంపలమీదికి ప్రవహిస్తున్నాయి. 

# జీవనసఖి

## డి. మంజులత

గోపి, సీత—వివాహం చాలా విచిత్రంగా జరిగిపోయింది. ముహూర్తాలు నిశ్చయించలేదు, పెద్దలు జోక్యం కలుగచేసుకోలేదు. వాళ్లిద్దరు ఒకరి నొకరు అర్థంచేసుకున్నారు. ఆపైని వివాహం చేసుకోవాలని తీర్మానించుకున్నారు. గోపి ఈ విషయం తన స్నేహితులతో, సీత తన స్నేహితురాండ్రతోనూ చెప్పుకున్నారు. ఆఖరకు మిత్రుల సహాయంతోనే పెళ్లి జరిగిపోయింది. పెళ్లి జరిగిన కొద్దిరోజులకే పరీక్షలు కూడా పరిసమాప్తమయ్యాయి.

పరీక్షలు కావటంతోటే ఉభయులు ఒక ఇల్లుతీసుకొని వుండసాగారు. అప్పటిదాకా ఎలాగో ఇంటిదగ్గరవాళ్లు సాయపడ్డారు; కాని ఆపైన ఆర్థికంగా సాయపడే స్తోమత ఉభయ కుటుంబాల్లో ఏ ఒక్కరికీ లేకపోవటంవల్ల—గోపి, సీత తమ బతుకు తాము బ్రతకటానికే నిర్ణయించుకున్నారు. అప్పటిదాకా విద్యార్థి జీవితాన్ని గడుపుతుంటూ చీకూ చింతా లేకుండా...ఊహాలదోనెల్లో విహరించే ఆ యువ దంపతులకు వాస్తవిక జీవితం కొరకరాని కొయ్యగానే కన్పించింది, కొద్దికాలానికే! భార్యాభర్తలిద్దరూ బి. ఏ. ప్యాసయ్యారు. చదువు పూర్తవగానే ఉద్యోగాలు అవలీలగా లభించగలవని వాళ్లు వేసుకొన్న అంచనాలు కాళ్లు తిరిగిపోయేట్టు చెప్పుల్లు తిరిగాక కాని...... అర్థం లేనివని తెలియలేదు. గోపి ఈ విషయంలో ఎక్కువగా బాధపడుతున్నాడు. పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నాడు — 'ప్రేమించి పెళ్లిచేసుకున్న భార్యను సుఖపెట్టలేకపోతే లోకం ఏమనుకుంటుంది?' అని!

ఒకరోజు రాత్రి గోపి పెదవుచుట్టూ ఎన్నెన్నో ఆలోచనలు గుమిగూడటంవల్ల నిద్రపట్టలేదు. పక్కమీద అటూ ఇటూ పొర్లుతున్నాడు. సీతకూడా మేల్కొనే వున్నది.

'నిద్రపోలేదా?' అంది సీత.

'నువ్వూ మేల్కొనే వున్నావా?' అన్నాడు అతను.

'ఏమిటాలోచిస్తున్నారు?'

'నిన్నుగురించే ఆలోచిస్తున్నాను!'

'అలాగా! నేను మనఉభయుల్నిగురించి ఆలోచిస్తున్నా!'

'నువ్వు అనవసరంగా బాధపడుతున్నట్లున్నావు! ఎప్పుడూ మనం నిరుద్యోగులుగానే వుంటామేంటి? ఏదో ఒకటి దొరక్కపోదు. అవునుగాని - నా మొదటి జీతం ఎలా ఖర్చుపెట్టతలచానో నీకు తెలుసా?'

'అలాలేదు, మాలాలేదు, బాగానే వుంది - అయినా చెప్పండి'.

'నీకోమంచి చీర కొంటాను!'

'నాకు ఏ చీరంటే ఇష్టమో మీకు తెలుసా ఏమిటి?'

'ఏచీరకొన్నా నీకు బాగా నేవుంటుంది'

'ఆతరువాత?'

'రెండో నెల జీతంతో నీకో రిస్టువాచీ కొనదలచాను'

'ఎందుకు నాకివన్నీ? మీరు గడియారం కొనుక్కోండి?'

'దానికేం తొందరలేద్దూ! నీవిషయం ముఖ్యం నాకు'

ఇలా ఏవేవో వూహల్లో విహరిస్తూనే ఆ ఉభయులూ స్వప్నాల్లో తేలిపోయారు.

ఆ రెండోరోజు ఉదయం గోపి సీతకంటే ముందు లేచాడు. ఇంతలోకే పాలవాడు కూడా రావటంతో - పాలు తీసుకొని - వంటఇంట్లోకెళ్లాడు. కాఫీ తయారుచేసి సీతకు సర్‌ప్రైజ్ ఇవ్వాలనుకున్నాడు. కుంపటి ఎలాగో కష్టపడి వెలిగించాడు. పొయ్యిమీద డికాక్షనకు నీళ్లుంచి - కప్పూ సాసర్లూ అన్నీ సిద్ధంచేస్తూ పంచదార డబ్బా మూతతీసి చూచాడు. దాంట్లో రవ్వంతకూడా లేదు. నిన్న సాయంత్రం నలుగురు మిత్రుల్ని తీసుకురాగా సీత కాఫీ తయారుచేసి ఇచ్చింది. దాంట్లో పంచదార కాస్తా ఖాళీ అయివుంటుందని - గోపి అనుకుంటూ వుండగానే - వెనకనుంచి - సీత వచ్చి - పరిస్థితిని ఇట్టే పసిగట్టేసింది.

గోపి తాను సీతకు సర్‌ప్రైజ్ ఇవ్వాల్సింది; వంటింట్లో కాదని, ఏదో ఒక ఉద్యోగం సంపాయించి అదిచ్చి ఆశ్చర్యచకితను చేయాలని నిర్ణయించుకొని - కప్పూ సాసర్లూ, పొయ్యిమీద డికాక్షనూ అలాగే వుంచి - వెనక్కి తిరిగేప్పటికి సీత నవ్వుతూ గుమ్మంలో కన్పించింది.

'నిన్న కొంచెం పంచదారతీసి వేరే వుంచాను - ఈ పూటకని! అయినా మీరు చేతులు కాల్చుకోవలసిన అవసరమేమొచ్చింది, చెప్పండి'" అని సీత - కాఫీ తయారుచేసి ఇచ్చింది.

కాఫీ తాగి గోపి వెంటనే బజారుకెళ్లి 'హిందూ' పేపరు కొన్నాడు. 'వాంటెడ్ కాలమ్స్' గబగబా చూచాడు. తక్కిన పేజీలవేపు గోపి దృష్టి సారించనైనా లేదు. హాండుంగ్ సమావేశాలు, ఆంధ్ర

అసెంబ్లీ గొడవలకు సంబంధించిన వార్తలూ - ఇన్నీ అతనికి అర్థంలేనివిగా కన్పించినాయి.

పది, పన్నెండు అప్లికేషన్లు—వివిధ ఉద్యోగాలకు పంపించి చూశాడు. కాని ఎక్కడినుంచీ కూడా అతనికి సమాధానమే రాలేదు. ఇంకా ఏదో ఆశ అతన్ని బాధిస్తోంది.

ఒకరోజు ఉదయమే లేచి—గోపీ కాలి నడకను నగరంలో తను అప్లికేషన్లు పంపించిన ఆఫీసుల్ని చుట్టచుట్టి రావటానికి బయలుదేరాడు. 'బి. యే. ప్యాసయాను కనుక - వంద రూపాయల ఉద్యోగమైనా దొరకదా?' అని ఆశించిన గోపీ - ఏదో ఒక ఉద్యోగం చిన్నదైనా సరే—దొరికితే చాలునని - పేవ్‌మెంట్ ప్రక్కనేవున్న షాపుల్లోకి తొంగిచూస్తూ నడుస్తున్నాడు. ఒక చోట సైకిల్ షాపులో పెద్దాళ్లూ కుర్రాళ్ళూ కూడా ఒళ్లు వంచి ఎంతో శ్రమపడుతున్నారు. ఒక ఫర్నిచర్ షాపులో - ఎంతోమంది వరసగా పని చేయటం చూచాడు.—ఒకడు చిత్రిక పడుతుంటే, మరొకడు - పాలిష్ చేస్తున్నాడు. అంతా చెమటోడ్చి పనిచేస్తున్నారు. షాపులవేపు చూట్టం మానేసి - గోపీ తళతళ మెరిసే తారురోడ్డువేపు చూస్తూ నడవసాగాడు. ఎంతో అందంగా వుంది రోడ్డు! రకరకాల కార్లు పరుగెత్తుతుపోతున్నాయి. స్ప్రింగ్ సీట్లమీద కూర్చున్న వ్యక్తులు మెత్తగా ఎగిరెగిరిపడుతూ బయటకి చూస్తూపోతున్నారు. గోపీ - ఆ అందమైన కార్లవెనక, ఏవేవో సామాన్లు వేసుకొని నెమ్మదిగా, అతికష్టంమీద - కొంతమంది కూలీలు బళ్లు నెట్టుకుంటూ వెళ్లటం చూచాడు.

తారురోడ్డుకుమల్లేనే, వాళ్లనల్లటి శరీరాలు ఎండకు తళతళ మెరుస్తున్నాయి. కండరాలు నిడులు తేలుతున్నాయి. వాళ్లను చూచి గోపీ - తనకూ వాళ్లకూ సామ్యం ఎక్కడైనా వుందేమోనని ఆలోచించి చూచాడు. "కేవలం జీవించటంలో మాత్రమే సామ్యం వుంది. కాని దాన్ని సాధించటంలో మాత్రం వ్యత్యాసం వుంది. వాళ్లు శారీరకంగా శ్రమపడి జీవించగలరు. తను కుర్చీలో కూచొని మానసికంగా మాత్రమే శ్రమపడి నాలుగురాళ్లు సంపాయించుకోగలడు. ఈరోజున ఒళ్లు వంచి పనిచేస్తానన్నా తనను తీసుకునేందుకు ఎవరూ సిద్ధపడరు. తనిలా మధ్యస్థంగా వుండిపోవలసిందే!" అని పరిపరివిధాలుగా ఆలోచించుకున్నాడు గోపీ.

ఉదయం ఇంటిదగ్గర కాఫీతాగి బయలుదేరిన గోపీ ... సాయంత్రం ఐదుగంటలకు ఇంటికి వెళ్ళడం ఇష్టంలేక తిరగటం మానేసి ఒకపార్కులో చతికిలబడి - తన కాళ్ళ తిప్పటను పర్యావలోకనం చేశాడు. తను దరఖాస్తులు పెట్టుకున్న ఉద్యోగాలన్నీ నిండిపోయాయి.

మొదటి ఉద్యోగం ఆ ఆఫీసుయజమాని భార్య అన్నకొడుకు బావమరిదికి లభించింది; రెండోది: మేనేజరు పినతండ్రి అల్లుడుకి; మూడోది: ఒక మంత్రిగారు సిఫారసుచేసిన వ్యక్తికి లభించింది; నాలు

గోది: షెడ్యూల్డ్ తరగతికి సంబంధించిన ఒక వ్యక్తికి లభించింది; ఐదోది: ఒక డబల్ గ్రేడ్యుయేట్‌కు లభించింది; ఆరో దానికి:ఒక మంచి స్పోర్ట్స్‌మన్ కావాలట; ఏడోది: ఇంకా అలాగే వుంది, ఎవరిని నియమించలేదు. ఎనిమిదో ఉద్యోగం: అక్కడికి తను వెళ్ళడానికి కొద్దినిమిషాల పూర్వమే ఒక మహిళా గ్రేడ్యుయేట్‌కు కేటాయించడం జరిగిపోయింది.

గోపీకి మినిస్టరుఫాయాలో బంధువు లెవరూ లేరు. పెద్ద స్పోర్ట్స్‌మన్ కూడా కాదు. షెడ్యూల్డ్ తరగతికి సంబంధించిన వాడై వున్నా ఉద్యోగం దొరికేది. చివరకు తను ఒక గ్రేడ్యుయేట్ అయినా అయివుంటే ఎంత బావుండేది! గోపికి తనమీద తనకే కోపం వచ్చింది. – ఆఖరకు ఎలాగో సమాధానపరుచుకున్నాడు – "ఇన్నిరోజులు శ్రమపడ్డాను – మరికొన్ని రోజులు ఓర్చుకుంటాను" – కాని గోపి మనస్సు కుదుట పడలేదు. కారణం: తన ఉద్యోగానికి ఒక స్త్రీ పోటీవచ్చి – తను చూస్తూవుండగానే దాన్ని కాస్తా తన్నుకపోయింది. వాస్తవంగా అయితే గోపీకి స్త్రీల చదువుల్ని గురించీ, వాళ్ళ ఉద్యోగాల్ని గురించీ ఎలాంటి దురభిప్రాయాలు లేవు. కాని ఈ ఉద్యోగం కాస్తా ఒక స్త్రీకి లభ్యం కావటంచేత – కొంచెం బాధపడి ఆ ఉద్యోగం సంపాయించుకున్నావిడ్ని బాగా తిట్టుకున్నాడు మనస్సులో.

చివరకు ఖిన్నవదనంతో ఇంటికి తిరిగొచ్చాడు. వచ్చినవాడు వచ్చినట్లే – సీతతో మాటా – పలుకూ లేకుండానే – చాపమీద వేసివున్న పరుపుమీద మేను వాల్చి గోడవేపుకు మొహం తిప్పుకొన్నాడు.

'ఏమైంది?' అన్నది సీత దగ్గరగా వచ్చి కూచుంటూ! 'ఏమీ కాలేదు!' అని క్లుప్తంగా సమాధానం చెప్పాడు గోపీ.

కొంచెంసేపు గడిచింది.

'ఉద్యోగం లేకుండా కాలం గడపటం ఎలాగు సీతా ... నేను భరించలేకుండా వున్నాను. నా అసమర్థతకు నేను చాలా విచారిస్తున్నాను.'

'నాకలాంటి విచారమేమీ లేదు.'

'ఉద్యోగం సద్యోగం లేని భర్తల్ని భార్యలు ప్రేమతో చూడగలరా సీతా?'

'ఇతరుల విషయం నాకు తెలీదుకాని, నాకుమాత్రం ఆబాధేమీ లేదు.

'నేనంటే నీకంత ప్రేమ వుండకూడదు సీతా!'

'సరే పోనీయండి! మీరు అప్లై చేసిన వాటిల్లో ఏదో ఒక ఉద్యోగం తప్పకుండా దొరకవచ్చునని చెప్పారుగదా. దానివిషయమేమయింది?'

'అదా? ఒక స్త్రీ తన్నుకుపోయింది. ఒక్క దెబ్బన నన్ను వెనక్కు నెట్టేసింది. ఇక ఆడవాళ్ళతో కూడా పోటీలు పడాల్సిందే!'

'అవునుగాని—అలా వెనక్కు నెట్టేసి ఆ ఉద్యోగం తన్నుకపోయిన స్త్రీని నేనే అయితేనో?'

'ఏమిటీ నువ్వనేది?'

'ఏముందీ? దానికి నేనూ అప్లై చేశాను, అది నాకొచ్చింది.'

'అయితే – ఆఖరకు నువ్వే జయించావు! నేనోడిపోయాను.'

'దీంట్లో జయాపజయాలేమీ లేవు. ఎవరికో ఒకరికి ఉద్యోగం దొరికింది. అదే చాలు.'

'అంటే నువ్వు సంపాయిస్తుంటే నేను తింటూ ఎలా కూచోవటం?'

'బాబుగారూ! ఇంతకాలంనుంచి మొగవాళ్లు సంపాయించుకొస్తూంటే ఆడవాళ్లు వాళ్లమీదనే ఆధారపడి ఇళ్లల్లో కూచోలేదా ఏంటి? రోజులు మారాయనుకోండి.'

ఆతరువాత ఉభయులూ కొంచెంసేపు మౌనం వహించారు.

'ఉద్యోగంలో ఎప్పుడు ప్రవేశిస్తావు?'

'రేపటినుంచే'

'అంటే నేను రేపటినుంచి వంట...'

'వంటా – గింటా మీరేమీ చేయనవసరం లేదు – అవన్నీ నే చూసుకోగలను'

'నాకు అన్నం వండటంమటుకు బాగా తెలుసు. ఆపనయితే నేనే చేస్తాను!'

'నమస్తే సాబ్! మీరేమీ చేయనవసరం లేదు. అన్నీ నే చేయగలను!'

'అంటే ఉద్యోగం కూడానా?'

'అవును! చిన్నచిన్న ఉద్యోగాలకు పాటుపడటం ఏమంత మంచిపని? కనుక ప్రవేటుగా మరికొన్ని పరీక్షలకుచదివి పెద్ద ఉద్యోగంకోసం ప్రయత్నించండి!'

ఈమాటలు విని గోపీ ఒక్కసారిగా స్తబ్ధుడై సీతమొహం చూడసాగాడు. ఏం మాట్లాడాలో అతనికే తెలియలేదు.

'ఏంటి, నావేపలా చూస్తారు? రండి భోజనానికి లేవండి' అన్నది సీత!

గోపీ ఆనందానికి మేరలేకపోయింది. నవ్వుతూ సీతవెంట వంటఇంట్లోకి నడిచాడు.





(రాజమండ్రివద్ద గోదావరి దృశ్యం; ఫొటో: డి. రామలింగేశ్వరరావు.)

# వనితాలోకం

## సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు

"నేను బ్రతికిఉండగా ధనాభావము చేత స్త్రీ జనాభ్యుదయకరమైన సంస్థలను స్థాపించలేకపోవటము గాని, సమితి కార్యక్రమాలు నిలిపివేయబడటము గాని ఉండరాదు - ఉండకూడదు. ఇది నా ప్రతిజ్ఞ!" అని శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ గారు ఈ నెల 10వ తేదీన కమ్యూనిటీ ప్రాజెక్టులను పరిశీలించటానికి పతిసహితముగా హైదరాబాదు వచ్చిన సందర్భములో అన్నారు. స్థానిక సాంఘిక సంక్షేమ సమితివారి యాజమాన్యమున నిర్వహింపబడుతున్న శిశు కేంద్రపక్షమున దేశముఖ్ దంపతులకు బ్రహ్మాండమైన స్వాగతము ఏర్పాటయినది. వ్యవసాయశాఖ వయోజన విద్య, బాలికల పాఠశాలలపక్షాన వస్తుప్రదర్శనము జరిగినది. శ్రీ దేశముఖ్ గారు ఆ సభకు ప్రారంభోత్సవము చేశారు. ముఖ్యమంత్రి అధ్యక్షత వహించారు. విద్యార్థినులు శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ గారికి సన్మానపత్ర మొకటి సమర్పించారు.

శ్రీమతి దుర్గాబాయిగారు కేంద్రసాంఘిక సంక్షేమసమితికి అధ్యక్షురాలు. దేశ సౌభాగ్యమును ఇనుమడింపచేయటానికి 1952వ సంవత్సరములో అనువైన పథకాలతో పంచవర్ష ప్రణాళిక ఏర్పడి సహస్ర శక్తులతో బహుముఖాలుగా పనిచేస్తున్నది.

ఈ ప్రణాళికలో స్త్రీ శిశు జనాభ్యుదయానికొక ప్రత్యేక సమితి నిర్మాణమయినది. పథకాలు సిద్ధము చేయబడ్డాయి. ఈ కార్యక్రమము సాధించటానికి కేంద్రసమితి పక్షమున రాష్ట్రమున కొకటివంతున 28 రాష్ట్రములలో సమితు లేర్పడ్డాయి. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలద్వారా ముఖ్యముగా సాధించదలచిన పనులు నిరక్షరాస్యత అనారోగ్యములను నిర్మూలించటము, అతిగా పెరిగిపోతున్న జనాభాను అరికట్టటము, అనాధ వితంతు శిశు శరణాలయాలను స్థాపించి వారి అభ్యుదయానికి కృషిచేయటము, వికలాంగులకు మూకబధిరాంధులకు అనువైన శరణాలయాలను స్థాపించి వారికి కూడా తోటిమానవులతో సమానముగా గౌరవ ప్రతిపత్తులను పౌరస్వత్వమును కలిగించటము తలపెట్టారు..

భారతదేశమంతా సిమెంటు రోడ్లమీద సున్నితముగా తిరిగే మోటారుకార్లతోను, విద్యుద్దీపాలతో నిత్య దీపావళిగా శోభించే పట్టణాలతోను నిండి లేదు. నీరు ఆహారము వైద్యము కరవైన కుగ్రామాలు భారతదేశమందంతటా ఉన్నాయి. ఈ గ్రామాలలో స్త్రీలకు విద్య లేదు. ఆరోగ్యము లేదు. బాలెంతశిశు మరణాల సంఖ్య అపరిమితము.

భారతదేశములో స్త్రీలు నూటికి 50 వంతున ఉన్నారు. కాని నూటికి 5, 6 గురు మాత్రమే వ్రాయను చదువను వచ్చినవారు. విదేశాలలో నూటికి 50 వంతున విద్యనేర్చిన స్త్రీలు ఉన్నారు. ప్రణాళికలో ఇది ప్రధానమైన సమస్యగా భావింపబడ్డది. నిరక్షరాస్యతా నిర్మూలనానికి అనేక పాఠశాలలు గ్రామాలలో స్థాపింపబడి పనిచేస్తూ ఉన్నాయి.

. ప్రతి పది గ్రామాలకు ఒక శిక్షితయైన మంత్రసానిని, ప్రతి అయిదు గ్రామాలకు ఒక సాధారణ దాదిని ఏర్పరగవలెనని ఈ సాంఘికసంక్షేమసమితి సంకల్పించింది. 'ప్రతి పదివేలమందికి ఒక వైద్యుని, ప్రతి 5 వేలమందికి ఒక సుశిక్షితురాలైన మంత్రసానిని ఏర్పరచ కలిగినప్పుడే మనము తల యెత్తుకొని తిరుగకలుగుతామ'ని శ్రీమతి దుర్గాబాయిగారు ఉద్ఘాటించారు. 'విదేశాలలో స్త్రీశిశు జనానికి కల్పింపబడిన సౌకర్యాలను భారతదేశీయులకు కూడా కల్పింపబూనుకొన్నా'నని ఆమె తెలిపారు.

అనేక కష్టాలుపడి త్యాగాలుచేసి సంపాదించుకొన్న స్వాతంత్ర్యాన్ని నిలుపుకోవటము సామాన్యము కాదు. దేశము స్వతంత్రముగా నిలబడవలెనంటే ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాలను సంపాదించుకోవాలి; సంపాదించుకొన్నవాటిని నిలుపుకోవాలి. ఈరెండూ సాధించటానికే పంచవర్ష ప్రణా

కాక ప్రధానముగా కృషి చేస్తున్నది.

ఏ దేశ సౌభాగ్యమయినా ఆ దేశీయుల కృషివల్లనే పెంపొందుతుంది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక 1952 వ సంవత్సరములో ఏర్పడినది. 1957 వ సంవత్సరము మార్చి నెలతో పూర్తి అవుతుంది. తిరిగి ఆ ఏప్రిల్ నుండి 61 మార్చివరకు రెండవ పంచవర్ష ప్రణాళిక అమలులోకి వస్తుంది. రెండవ ప్రణాళికకు కావలసిన పథకాలు సిద్ధము అవుతున్నాయి. ప్రణాళికలో సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు జరగటానికి కావలసిన ధనము సేకరించబడినది. ప్రభుత్వము కేటాయించిన కొన్ని కోట్ల ధనముకాక ప్రజలవద్ద సేకరించినదికూడా ఉన్నది. కార్యక్రమాలు కొనసాగటానికి ధనా

# ★ సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు ★

భావములేదు కాని కృషి చేయటానికి విశ్వసనీయులైన అభ్యుదయకాంక్షతో పనిచేయగల కార్యకర్తలు అధిక సంఖ్యాకులు కావలసి ఉన్నారు. 'గ్రామ పునరుద్ధరణకై లక్షలాది స్వచ్ఛంద సేవికలు అవసరము. ఈనాడు మన దేశములో ప్రజాభ్యుదయానికి తగిన కృషి సలపటానికి ప్రణాళికలు, పథకాలు ఉన్నాయి. వాటిని జరిపించటానికి కావలసినంత ధనము ఉన్నది. కాని కృషి చేయటానికి కార్యకర్తలు తగినంతమంది లేరు. సంఘ కార్యకర్తలు అధికారులు పరస్పర సహకారముతో కృషి చేస్తేనే గాని దేశ మభివృద్ధికి రాదని శ్రీమతి దుర్గాబాయి గారి దృఢనమ్మకము. ప్రజాధనము ప్రజాభ్యుదయానికే వినియోగించాలని ఈనాటి ప్రభుత్వాదర్శము - అభిమతము.

'ఇంతవరకు ఈ పథకముక్రింద జరిగిన కృషి అల్పము. జరుగవలసినది అధికము. నడచిన దారి కొంచెము. ముందుకు పోవలసినది ఎక్కువ. కాని మార్గము అగమ్యముగా ఉన్నది. ఈనాడు సంఘ మొకేకారణ్యముగా అనేక సమస్యలతో అగమ్యగోచరముగా ఉన్నది. ఈ కారణ్యాన్ని బాగుచేసి చక్కని బాటలను వెయ్యాలి. నూటికి 80 వంతున అక్షరాస్యులను తయారుచేయటయే మన గమ్యస్థానమని శ్రీమతి దుర్గాబాయి అన్నారు.

'*Charactor building is the Strength of the Nation* సత్ప్రవర్తనను సుదృఢముచేయటమే దేశసౌభాగ్యము. మనకు ప్రస్తుతము కావలసినది ఇదే' అని ఉపన్యాసము ముగించారు దుర్గాబాయి గారు.

సాంఘికసంక్షేమ కార్యక్రమాల క్రింద సంఘ సేవికలకు తగిన శిక్షణ నివ్వటానికి సౌరాష్ట్ర ప్రభుత్వము ఒక పథకము తయారుచేసింది. గ్రామాలలోని కేంద్రాలలో స్త్రీ శిశుజనాభ్యుదయానికై కృషి చేయటానికి శిక్షణను పొందిన సేవికలనే పంపుటకు నిశ్చయించారు. అహమ్మదాబాదులోని గాంధి స్మారకనిధి ఆశ్రమములో గ్రామ సేవికలకు శిక్షణ యివ్వబడుతుంది. మంత్రసాని పని, వయోజన విద్య ప్రథమ చికిత్సలలో శిక్షణ యివ్వబడుతుంది. కోర్సు 10 నెలల కాలముని నిర్ణయింపబడ్డది.

సాంఘిక సంక్షేమసమితిపక్షమున ఢిల్లీ పట్టణములో సహకారపద్ధతిమీద అగ్గిపెట్టెల కర్మాగార మొకటి స్థాపింపబడి పనిచేస్తున్నది. ఈ కర్మాగారము అగ్గిపుల్లలను మందును ఇండ్లకు పంపుతుంది. విరామముగల స్త్రీలు తమ గృహపరిసరాలలోనే చేతనయినపని చేయవచ్చును. అగ్గిపుల్లలకు మందు అంటించటము పెట్టెలలో నింపటము పూర్తికాగానే కర్మాగారమువారే వచ్చి పెట్టెలను తీసుకొని వెళ్లుతారు. ఇటువంటి కర్మాగారమొకటి హైదరాబాదు సాంఘిక సంక్షేమసమితిపక్షమునకూడా స్థాపించవలెనని సంకల్పించినట్లు తెలుస్తున్నది.

దేశము బాగుపడవలెనంటే స్త్రీలు తమ వంతు కృషిని కుటుంబానికి సంఘానికి చేస్తేనేగాని సాధ్యముకాదు. స్త్రీలు తమ పరిస్థితులను అవగాహనచేసుకొని తమ సమస్య లేవో తెలిసికోవాలి. వాటి పరిష్కారమార్గమును అన్వేషించాలి. తమ జీవితాలకు కుటుంబాలకు సంఘాలకు చేరుపురుగులైన మూఢవిశ్వాసాలను దురాచారాలను నిర్మూలించుకోవాలి.

ఈ ప్రణాళికద్వారా నిరక్షరాస్యతా నిర్మూలనానికి వయోజనపాఠశాలలు ప్రాథమికపాఠశాలలు విరివిగా స్థాపింపబడి కృషి చేయటము అభినందించతగినది. ఆస్ట్రేలియా దేశములో పాఠశాలలు కళాశాలలు విరివిగా ఉన్నప్పటికీ మెట్రికులేషను కళాశాల విద్యవరకూ ఉచితముగా గరపబడినప్పటికీ పేరి వేసినట్లుగా బహు దూరప్రాంతాలలో నివసిస్తున్న అనేకమంది ప్రజలకు విద్యలేదు. వారి సౌకర్యార్థము అక్కడి ప్రభుత్వము పోస్టుద్వారా వివిధవిషయాలలో విద్యాబోధను ఏర్పాట్లుచేసింది. ఈ విధానములో సాధారణపాఠశాలలో నేర్చుకొనే విషయాలే కాక సాంకేతిక వృత్తివిద్యలుకూడా నేర్పబడుతున్నాయి. ఈ కరెస్పాండెన్సు కోర్సు వలన కలిగే లాభాలు కొలంబో పథకము క్రింద ఆసియాలోని 18 ఇతర దేశాలకు కూడా (ఇండియా, సిలోను, ఇండోనీషియా మొదలైనవి) వర్తించే ఏర్పాట్లు ఆస్ట్రేలియా ప్రభుత్వము ఇటీవలనే ప్రకటించింది. పైన పేర్కొన్న దేశాలలోని ప్రభుత్వాలచే నిర్ణీతులైన 400 మంది విద్యార్థులకు ఈ సౌకర్యాలను కలుగచేయటమే కాక వారిని కొంతకాలముపాటు ఆస్ట్రేలియాకు రప్పించి విద్యను పూర్తిచేసుకొనే అవకాశము కూడా కల్పింపబడుతుందని ప్రకటింపబడ్డది.

కరెస్పాండెన్సుకోర్సుద్వారా విద్య నేర్పుట మనము ముఖ్యముగా గమనింపతగిన విషయము. ఫ్రాంసు దేశములోను మరి కొన్ని ఇతర దేశాలలోను ప్రభుత్వాలు విశ్వవిద్యాలయాలు దీనిని ఆమోదించి ఆచరణలోకి తెచ్చాయి. ఇంగ్లండు అమెరికా దేశాలలో చాలా విద్యాసంస్థలు ఈ విధానాన్ని విజయవంతముగా నడుపుతున్నాయి. అక్షరాస్యతలో వెనుకబడి ఉన్న ప్రజాబాహుళ్యముగల మన దేశములో ప్రభుత్వ విద్యాశాఖలు వివిధ భాషలలో సక్రమ పద్ధతులపైన కరెస్పాండెన్సుకోర్సులను నడిపినయెడల శ్రీమతి దుర్గాబాయి గారు వాంఛించినట్లుగా నూటికి 50 వంతున అక్షరాస్యత మాత్రమే కాక ప్రజలు విద్యావంతులగుటలో సందేహము లేదు. స్త్రీల విషయములో ఈ విధానము మరింత ప్రయోజనకారి కాగలదు. ★

వనితాలోకం :

# సెలవుల్లో....

'విశ్వమిత్ర'

మా మావయ్య కూతురు ఉమ మహా బద్ధకస్తురాలు. నేనోసారి సెలవులకి అక్కడికి వెళ్ళినప్పుడు, సెలవుల్లో వున్న ఉమ నన్ను, 'ఈ సెలవుల్ని మరిచిపోలేనట్టుగా వుండే పనేదైనా చెప్ప' మంది. అంటే ఉమ వుద్దేశం, హాయిగా గడిచిపోయే ఆ సెలవుల్ని మరిచిపోకుండా వుండగలిగేట్టు చెయ్యాలి. నాకో ఆలోచన పోయింది. 'సరేగానీ, మరి నేను చెప్పినట్టు చేస్తావా?' అన్నాను. 'ఓ' అంది, నేనేదో చిన్నపనే చెప్తాననుకొని.

'చివరిదాకా నే చెప్పినట్టుచేస్తే చివరికి అంత గొప్పపని చేసినందుకు నువ్వే ఆశ్చర్యపోతావు' అన్నాను ఉమని ప్రోత్సహిస్తూ.

సహజంగా ఉమకి ఆశ పుట్టింది. ఆ ఆశని పెంచి పోషించాల్సిన బాధ్యత నాదైంది. నేను చెప్పినట్టల్లా చేస్తానన్న ఉమని మొట్టమొదట తన పుస్తకాల రాక్ ని జాగ్రత్తగా సర్దుకోమన్నాను. నేనామాట అనగానే సెలవుల్లో కూడా పుస్తకాలు గొడవేనా? అన్నట్టు నావంక చూసింది గానీ మళ్లీ నేను చెప్పిన మాటలు జ్ఞాపకంవొచ్చి అతి కష్టంమీద ఆ పుస్తకాలన్నీ జాగ్రత్తగా సర్దింది.

నిజంగా ఆ సర్దటంచూస్తే నాకే ఆశ్చర్యం వేసింది. కానీ ఉమ మాత్రం అదేం పట్టించుకోలేదు. నా మెప్పుకోసం, తద్వారా నేను చెప్పిన గొప్పపనిని, తనచేత చేయించబడటంకోసం, చేసిన పనిగా మాత్రమే చేసింది. కానీ తర్వాత అంగుల్లో వున్న అందాన్ని నేను చెప్పిన తర్వాత చూసి నిజమేనని ఒప్పుకొంది.

తర్వాత ఏవో చిన్న చిన్న పన్లు నాక్కావల్సినవి అన్నీ చేయించుకుంటూ వుండేవాడిని. ప్రతి పనికీ ఉమ నన్ను ఎంతో అనుమానించేది గానీ, ఓ రహస్యాన్ని నేను గుప్పెట్లో మూసిపెట్టి, అదేదో తనకి ఒక్కసారిగా చూపిస్తాననే రకం ఆశతో ఏం చెప్పినా చేసేది.

రేడియో బల్లమీద క్లాత్ కి ఓ డిజైన్ ఇచ్చి ఎంబ్రాయిడరీ పని చేయమన్నా. ఆ డిజైన్ చూసి, అమ్మో ఇంత పెద్ద డిజైనే అందిగానీ, నేను తగ్గకపోవటం వల్ల ఎప్పుడు పూర్తయిపోతుందా అనే దృష్టితోనే గబగబా కుట్టి ఓ రెండురోజుల్లో నాముందు పడేసింది. మళ్లీ ఓ రెండు రోజులుపోయాక ఉమకి రిసింగ్ రూమ్ వాకిలికి ఓ కర్టెన్ డిజైన్ ఇచ్చి జాగ్రత్తగా కుట్టాలన్నా. ఈసారి కుట్టటానికి బాధపళ్లేదు గానీ, చివరిదాకా ఇలాగే చేయించి చివరికి తనచేత చేయిస్తానన్న ఆ గొప్పపనేదో చేయించకుండా నే వెళ్లిపోతానేమోనని భయపడ్డది. కానీ నేను మళ్లీ ఆశని జ్ఞాపకంచేసి నోరూరించేటప్పటికి మాట్లాళ్లేక.

ఆ పని పూర్తయ్యేటప్పటికే, సెలవులు ఇంకా రెండురోజులు మాత్రమే మిగిలినయ్. అప్పటివరకూ కూడా ఉమచేత నేను చేయిస్తానన్న గొప్పపనిని గురించి, నేనేం మాట్లాడకపోవటం వల్ల ఉమకి కోపం వొచ్చింది అప్పుడు నేను చెప్పాను. గొప్పపని చేయటానికి ఎంతో ఎక్కువకాలం అవసరంలేదని, ఇంకా కావాలంటే ఓ ఉదాహరణ చెప్పనాఅని అడిగాను.

'చెప్పు' అంది.

'ఓ సైంటిస్ట్ ఏదో ఓ పదార్థం కనుక్కోటానికి ఏవేవో రసాయనిక పదార్థాలు ఎన్నో కలిపి వేడిచేసి, ఎంతోకాలం బాధపడ్డాట. చివరికి ఓసారి అలాగే వేడిచేస్తూ తనేదో పనివుండి, అదిచేసుకుంటూ, ఓ కుర్రాణ్ణి అక్కడపెట్టి, ప్రతి ఐదు నిముషాలకీ టెంపరేచర్ నోట్ చేస్తుండరా అనీ, ఆ ధర్మామీటర్ తోనే కొంచెంగా కలుపుతూండమనీ చెప్పాట. కాసేపటికి ఆ కుర్రాడు, అలా ఆ ధర్మామీటర్ తో కలుపుతుండగా ప్రమాదవశాత్తు ఆ ధర్మామీటర్ పగిలి, అందులోని పాదరసం కాస్తా ఆ పాత్రలో పడిందట. అప్పుడా కుర్రాడు పరుగెత్తుకుపోయి ఆ సైంటిస్ట్ తో చెప్పగానే ఆయనొచ్చి చూశాట-ఏముంది. అందులో అంతకాలంగా ఆయన కనుక్కోవాలనుకున్న పదార్థమేదో తయారై వుందిట....'

అంతదాకా సీరియస్ గా ఉంటున్న ఉమ మొహంలో ఆ చివ్వరి వాక్యంతో చిరునవ్వు మెరిసింది.

ఆఅవకాశం చూసుకొని 'చూశావా? ఆ సైంటిస్ట్, అంతకాలం కష్టపడితేమాత్రం ఏం ఫలముంది - అసలు కిటుకు తెలిస్తే, ఎంతసేపు?' అన్నాను.

'నిజమే—!' అంది ఉమ ఒప్పుకుంటున్నట్టు. అదివిన్న తర్వాత ఉమకి నామీద గురి మరీ ఎక్కువైంది. నేనేపనిచెప్పినా తప్పకుండా చేసేది.

ఆరోజు ఉమ కాలేజీ తెరిచారు. నేను ఆరోజే మావూరు బైల్దేరాను. నేను బైల్దేరబోతుండగా ఉమ కాలేజీనుంచీ వొచ్చింది. నాప్రయాణ సన్నాహంచూసి ఆశ్చర్యపోయింది. ఆక్షణంలో ఉమ మొహంలో వున్న భావం నాకర్థమైంది. తనచేత చేయిస్తానన్న ఓ గొప్పపనిని చేయించకుండానే నేను వెళ్లిపోతున్నానని ఉమకి కోపం.

కోపంగానే తన గదిలోకి వెళ్ళి, పుస్తకాన్ని సర్దివున్న రాక్ లో ఓచోట పడేసింది. వెనకనే నేనువెళ్ళి,

'ఉమా, నీచేత చేయించిన ఓగొప్పపనిని చెప్పనా?' అన్నాను.

'ఏమిటది?' అంది, ఆశ్చర్యంతో మొహాన్ని నావైపు తిప్పకుండానే.

'నువ్వు కనుక్కోలేవా?' అన్నాను.

'చెప్పరాదూ?' అంది కోపాన్ని పూర్తిగా వొదిలించుకోలేక.

'ఎప్పటికీ ఇప్పటికీ నీలో లేదా లేదంటావా?' అన్నాను.

'ఎప్పటికీ, ఎప్పటికీ?' అంది.

'సెలవుల ముందుకీ, సెలవుల తర్వాతకీ' కాసేపు ఆలోచించి ఒప్పుకోకుండా వుండలేక 'వుంటే?' అంది.

'బద్ధకాన్ని వొదిలించుకోలేని వాళ్లని అడుగు, అదెంత గొప్పపనో!' అని మెల్లిగా నేను వెనక్కి తిరిగాను.

ఉమ కాసేపు అలాగే కూర్చుని ఆలోచించింది. రేడియోబల్లమీద తను కుట్టిన రంగు పూలూ, వాకిలి కర్టెన్ మీదవున్న

 సెలవుల్లో.... 

నెమలి దంపతులూ ఉమ దృష్టిపథంలో మెరిసి నయ్యాను కొంటాను. వెంటనే లేచి, వెళ్ళిపోబోతున్న, నాదగ్గిరికొచ్చి వాకిలి కర్టెన్ని మెలిపెడుతూ,

నిజమేబావా, అవ్వన్నీ నేను సెలవుల్లో నేగా చేసింది. ఆ సెలవుల్ని ఈ రెండు విధాలుగా మరిచిపోలేను - నీకు థ్యాంక్స్ అంది.

ఉమ వొదిలిన వాకిలి కర్టెన్ మడతలు విడి, నెమలి దంపతులు మామూలుగు నిలిచినయ్.

'మరి నే వెళ్లొస్తా -' అని సెలవుతీసుకున్నా. 





# సంజవేళ


వేజెండ్ల సాంబశివరావు


అమ్మ నన్ను సంజవేళ
చదువమన్నది
బొమ్మ నన్ను మాటమంతి
ఆడమన్నది—

పిల్లగాలి అల్లిబిల్లి
తిరుగమన్నది
పిల్లకూన చర్లాటలు
ఆడమన్నది—

కొమ్మమీది కోకిలమ్మ
పాడమన్నది
తుమ్మెదమ్మ పూలతేనె
త్రాగమన్నది—

ఆటలాడ నేస్తగాండ్రు
కోరి పిలచిరి
కోటిపడగలెత్తి పరు
"హాయ్" యన్నది—

బుజ్జిబాబు! నీకు నాకు
భేదమేమని?
పంజరంబులోని చిలుక
ప్రశ్న వేసెను—

కన్నతల్లి నా మనసును
తెలియకున్నది
మనసు అల్లకల్లోలము
కెందుచున్నది—




## కాకి - నక్క

గుట్టుగా నొక కాకి
చెట్టు కొమ్మను కూరు
చుండె నోటను మాంస
ఖండమును గరచుకొని.

అంత నొక జంబుకము
ఆ మాంస ఖండమును
ఎత్తుకొని పోవనొక
ఎత్తుగడ వేసినది.

కాకివద్దకు పోయి
కపటమైత్రి నటించి
కొంటెనవ్వులు ఆపు
కొనుచు పలికిన దిట్లు:

"కాకి బావా! నీదు
కమనీయరూపమ్ము
కనులార మనసార
కాంచగలిగితి నేడు.

ఎంత చక్కని రూపు!
ఎంత చల్లని చూపు!
నీలమేఘశ్యామ
బోలు దేహము నీది.

కాకి బావా! నీవు
కావుకావని పాట
పాడినపుడెల్ల నే
పరవశింతును సుమా!

కోకిలను తెగమెచ్చు
కొందరీ కవులెల్ల.
కాకమా! పాటలో
నీకు నీవే సాటి.

కలము చేబట్టు ప్రతి
కవిగాడు కవి కాడు.
గొంతెత్తు ప్రతిపక్షి
కూత గానమ్మౌన?

తేనెలూరెడు నీదు
గానమ్ము విన్నంత
తన్మయత్వము కలిగి
జన్మ సార్థకమౌను.

బావ బావా! ఒక్క
భావగీతము పాడి
ఉల్లాసమున నన్ను
ఉయ్యాల లూపవా?"

నక్క మాటలు కాకి
నిక్కమని భావించి
కర్ణ కర్కశముగా
కావుకావని యరచె.

నోరు తెరచినయంత
జారె మాంసపు ముక్క.
ఒక్క యుదుటున దాని
నొడిసి పట్టెను నక్క.

"పాటతో పాటు నా
పాటు దయచేసితివి.
తన్మయుడనైతి, నా
జన్మ తరియించె" నని

నక్క మాంసపు ముక్క
నక్కుడే తినుచుండ
తిక్క కుదిరిన కాకి
బిక్కమొగమేసినది.

ఈసప్ కథలు: 1

సండూరి రామమోహనరావు



## నీతి

కపటమిత్రుల పొగడ్తలు
గడ్డి కప్పిన అగడ్తలు.

నిజమరయక నమ్మినచో
నిలువులోతు దిగబడుదురు.

# అల్లరి పిల్లలు



## 5. ఎంత మంచివాళ్ళో

పిల్లలు అందరూ ఒకేలాగా ఎప్పుడూ ఉండరు. కొందరు మంచివాళ్లూ ఉంటారు; కొందరు చెడ్డవాళ్లూ ఉంటారు. అంతేకాదు. కొందరు పైకిచెడ్డవాళ్లుగా కనిపిస్తారు గాని నిజానికి అంత మంచివాళ్లు ఇంకొకళ్లు ఉండరు. అలాగే మరి కొంతమంది ఎంతో మంచివాళ్లుగా కనిపించినా లోపల అంతా విషమే.

అయినా? ఎవరెటువంటివారో, ఎవరి స్వభావమెటువంటిదో గనుక తెలుసుకోగలిగితే చాలా బాగుంటుందికదూ? కాని అది ఎలా వీలవుతుంది?

ఒకసారి మాత్రం ఒక తమాషా జరిగింది. మాధవుడు బడికి పోయి శ్రద్ధగా చదువుకుంటుండేవాడు. వాడు చాలా మంచివాడు. తనకు మల్లేనే తన స్నేహితులు కూడా అందరూ మంచివాళ్లేనని వాడి అభిప్రాయం. అందుచేత అందరినీ ప్రేమించేవాడు; సఖ్యంగా ఉండేవాడు.

నిజానికి వాడి స్నేహితులందరూ కూడాఅంతమంచివాళ్లు కాదు. వాడి ఎదుట ఎంతో ప్రేమగా మాట్లాడి, చాటున వాడిని వెక్కిరించే వారు. ఈ సంగతి వాడికేమి తెలుసు? ఇంటి వద్ద అమ్మతో, తక్కిన వాళ్లతో వాళ్లనిగురించి మంచిగాచెపుతూ. పొగడుతుండేవాడు.

మాధవుడి ఇంటిప్రక్కన ముసలి ఆయన ఒకడున్నాడు. మాధవుడెప్పుడూ "తాతా! తాతా!" అంటూ ఆయనను విడిచిపెట్టకుండా తిరుగుతుంటాడు. తాతకు ఎన్నో విషయాలు తెలుసును. అవన్నీ ఎప్పుడూ మాధవునికి చెప్తుంటాడు. తాతకు మంత్రాలు వచ్చు! మాయలు చేతనవును. ఆయనవద్ద కొన్ని తమాషా తమాషా వస్తువులుండేవి. వాటిని చూచి మాధవుడు ఆశ్చర్యపోతూఉండేవాడు.

"ఇవన్నీ ఏమిటి తాతా! ఎందుకు ఈ పాతవన్నీ దాచిపెట్టావు?" అని వాడు ఎప్పుడన్నా అడిగితే, "కావాలిలే ఉండనీ! అవన్నీ కొన్ని మంత్రించినవస్తువులు. ఎప్పుడయినా పనికివస్తాయని ఉంచాను"అని చెప్పేవాడు తాత.

మామూలుగానే మాధవుడుతన స్నేహితులను గురించి తాతదగ్గర కూడా గొప్పగా చెపుతూఉండేవాడు. తాత వాడు చెప్పేది విని నవ్వుతుండేవాడు.

ఒకనాడు తాత అన్నాడు: "అబ్బాయి! నీవు ఊరికే నీ స్నేహితులనుగురించి చాలా చాలా చెప్తున్నావు. నిజంగా వాళ్లంతా నీవు చెప్తున్నంత మంచివాళ్లేనంటావా?"

"అవును తాతా!"

"సరే; అయితే రేపు నీవు బడికి పోయేముందు ఒకసారి నా దగ్గరకు రా!"

"ఎందుకు తాతా?" అని అడిగాడు మాధవుడు కుతూహలంతో; కాని తాత ఇంకేమీ చెప్పకుండా "రా! చూద్దువుగాని." అన్నాడు.

మాధవుడికి ఆరాత్రి నిద్రకూడా సరిగాపట్టలేదు. తెల్లవార్లు, తెల్లవారిపోయినట్లు, తాను బడికి పోవటానికి బయలుదేరుతున్నట్లు, తాత దగ్గరకు పోయినట్లు కలలువచ్చినాయి. ఆ తరువాత ఏమయిందో మాత్రం కలలోకి రాలేదు. ఎందుచేతనంటే, తాతదగ్గరకు వెళ్లినట్లు కలలోకిరాగానే వాడికి కుతూహలం ఎక్కువయ్యేది. "వచ్చాను తాతా!" అంటూనో, "ఎందుకు తాతా! రమ్మన్నావు?"అనో, కలవరిస్తూ కళ్లుతెరిచేవాడు.

తెల్లవారింది. ఎంతసేపటికీ బడికి పోయేవేళ కాదేమిటబ్బా అనుకుంటూ మహావేగిరపడ్డాడు. వాడి హడావుడి చూసి, అమ్మ రెండు మూడుసార్లు అడిగింది కూడాను.



**(1) చెడు వినకు, (2) చెడు చూడకు, (3) చెడు అడకు**

—ఫొటో: ఎస్. కృష్ణరావు—విజయనగరం.

"ఏమిట్రా సంగతి మాధవుడూ?" అని. "ఏమీ లేదు." అంటూ మాధవుడు తప్పించుకున్నాడు.

బడికి పోయే ముందు మాధవుడు తాత వద్దకు వెళ్లాడు. "ఆఁ వచ్చావా? రా! నీకు నేను ఒక వింత కళ్లద్దాల జోడు ఇస్తాను. ఇది ఎక్కడ పడితే అక్కడ ఉపయోగించబోకు. బడికి వెళ్లిన తరువాత, ఈ జోడు కళ్లకు తగిలించుకొని, నీ ముఖ్య స్నేహితులను చూడు. సాయంత్రం వచ్చి ఏం జరిగిందో చెప్పు" అన్నాడు తాత.

మాధవుడు ఆ కళ్ల జోడు తీసుకొని బయలుదేరి వెళ్లాడు. బడికి చేరుకున్నాడు. ఇంకా గంటకొట్టటానికి కొంచెం వ్యవధి ఉన్నది.

జానకి బడితోటలో చెట్టు క్రింద కూర్చొని వేరుశనగ కాయలు తింటున్నది; చూశాడు. గబగబ సులోచనాలు తీసి పెట్టుకున్నాడు. అరె! జానకి ఎంత తమాషాగా కనిపిస్తున్నదని! ఇంకా పరీక్షగా చూశాడు. జానకి మొహం కనిపించలేదు. అందుకు బదులు నక్క మొహం కనిపించింది. అంటే నక్క ఎంత జిత్తులమారియో, జానకి అంతే నన్నమాట. మాధవుడు ఆశ్చర్యపోతూ, సులోచనాలు తీసి దాని దగ్గరకు వెళ్లాడు.

ఎవరో వస్తున్నారని జానకి అడుగుల చప్పుడుబట్టి గ్రహించింది. చప్పున తాను తింటున్న వేరుశనగ కాయలు తీసి దాచేసింది. ఒలిచిన తొక్కలు కనిపించకుండా అన్నీ గబగబ పోగుచేసి వాటి మీద కూర్చున్నది. మాధవుడు ఏమీ ఎరగనట్లు దగ్గరకు వచ్చాడు.

"ఏం జానకీ! ఇక్కడ కూర్చున్నావేం!" అని అడిగాడు.

"ఏమీ లేదు. ఊరికే నే!" అన్నది జానకి.

మాధవుడు ఏదన్నా కొనుక్కుంటున్నప్పుడెల్లా జానకి వెంబడి వస్తుంటుంది. మాధవుడు తాను కొనుక్కొన్నదానిలో కొంత జానకికి ఇచ్చేవాడు. కాని వచ్చినవాడు మాధవుడే అయినప్పటికి కూడా జానకి తాను తింటున్న వేరుశనగ కాయలు బయటికి తీలేదు. "ఇలాంటిదా జానకి?" అనుకున్నాడు మాధవుడు.

"బడిగంట కొట్టుతున్నారు. వెళ్దాంరా! జానకీ!" అని పిలిచాడు మాధవుడు.

తాను లేస్తే సంగతి బయటపడి పోతుందిగా! అందుచేత "నేను

 

# అల్లరిపిల్లలు



కొంచెం ఆగి వస్తానులే! నీవుపోతూ ఉండు" అన్నది.

మాధవుడు లేచివచ్చేశాడు.

ఇలాగే తక్కిన స్నేహితులను చూశాడు. ఒకడు రాబందు. ఇంకొకడు గాడిద. మరొకడు పిల్లి. ఇలా అందరి స్వభావాలు బయటపడినాయి.

క్లాస్‌మానిటర్ అంటే మాధవుడికి చాలాభయం. క్లాస్‌లో కాస్త ప్రక్కకు తిరిగిచూసినా సరే బెంచీ ఎక్కిస్తుంటాడు. అతడు మంచివాడు కాదని మాధవుడి ఉద్దేశ్యం. అతని స్వభావం ఏమిటో చూద్దామని మాధవుడు అనుకున్నాడు.

కళ్లజోడు పెట్టుకొని చూశాడు. అతని ముఖం ఎలా కనిపించిందని? ఉత్తమజాతికి చెందిన కుక్క!. అంటే విశ్వాసపాత్రమైన స్వభావం కలవాడని తేలింది.

ఈ గమ్మత్తు చాలనుకున్నాడు. కళ్ళజోడు తీసి సంచిలో దాచాడు. సాయంత్రం తాతకి ఇచ్చేశాడు. జరిగినదంతా చెప్పాడు. అయితే తా నెటువంటివాడో చూచుకోవటం మాత్రం మరిచిపోయినాడు.

ఈ కథ చదివినతరువాత మీ రెటువంటివారో తెలిస్తే బాగుండును అని అనిపించటంలేదూ? కాని ఏం ప్రయోజనం? ఆ తాత ఆ కళ్లజోడు ఎవరికీ ఇవ్వడు.

అయినా కళ్లజోడుతో పెద్దఅవసరం లేదనుకోండి. ఎవరికి వారు ఆలోచించుకుంటే, మంచి వాళ్లో అవునో, కాదో తెలుస్తుంది. మంచి వాళ్లు అనిపించుకోదలిస్తే, తొందర పడకుండా మన ప్రవర్తనమంచిదేనా అని ఆలోచించుకొని సరిదిద్దుకుంటే సరిపోతుంది. ఏం? అంతే కాదూ?

★

— ము పీ.

"అసలే దాని కాలువాచి, నొప్పిఅని మొత్తుకుంటున్నది. నువ్వెళ్లి దాని కాలు తొక్కావా? అదేమిటిరా?"

"అది కాదమ్మా! నిన్న ఇంటిపనంతా అయిన తరువాత కాళ్లు నొప్పిగా ఉన్నాయని నన్ను తొక్కమనలేదూ! అందుకని నొప్పితగ్గుతుందేమో నని దానికాలూ తొక్కాను."

జోడపాటి సుందరి.
—మద్రాస్.

# వీర చతుష్టయం

రాళ్లబండి
రామకోటీశ్వరరాజు

ఘూర్జర దేశపు రాజు మహావీరునికి నలుగురు కుమారులు. ఒక్కొక్క కుమారుడు జన్మించేటప్పటికి ఒక్కొక్క పాతికభాగం రాజ్యం శత్రువుల హస్తగతమైంది. నాల్గవ వాడు పుట్టే టప్పటికి సాంతం రాజ్యం పరాజ్యమైంది. పిల్లలను భార్యను తీసుకొని రాజు బదరికాశ్రమం చేరి, కంద మూలాలు తిని బ్రతుకుతూ ఉన్నాడు.

నలుగురు కుమారులు పెరిగి పెద్దవారై విద్యలన్నీ నేర్చి, ఆరితేరిన వీర యోధులైనారు. వీరిసాహస పరాక్రమములు చూచి, అందరూ వారిని "వీరచతుష్టయం" అని పిల్చేవారు. వీరి పేర్లు వరుసగా విజయ సింహుడు, జయపాలుడు, అజేయుడు, విక్రముడు. ఒకనాడు వీరు ధనం సంపాదించటం కోసం తల్లిదండ్రులవద్ద శెలవు తీసుకొని, దేశాటనానికి బయలుదేరారు.

ఉజ్జయినీ నగరాన్ని ఆరోజుల్లో ఆదిత్యుడనే రాజు పరిపాలిస్తుండే వాడు. ఆయనకు నలుగురు కుమార్తెలు. వీరచతుష్టయం ఆదిత్యుని సందర్శించి, "మేము వీరచతుష్టయం అని పిలువబడే ఘూర్జర దేశీయులం. ఉద్యోగం నిమిత్తం వచ్చాం. ప్రపంచంలో ఎవ్వరూ చేయలేనిపని చేస్తాం." అని చెప్పారు.

"మీకు జీతమెంత కావాలి?" అని ప్రశ్నించాడు ఆదిత్యుడు.

"ఒక్కొక్కనికి నెలకు నూరు సవర్నుల బంగారం" అని చెప్పాడు విక్రముడు. ఆదిత్యుడు ఈ నలుగురికీ తన ఆస్థానంలో ఉద్యోగం యిచ్చాడు. ప్రపంచంలో ఎవరూ చేయలేనిపని కదా వీళ్లు చేసేది! అందుచేత తినటం, నిద్రపోవటం తప్ప వారికి వేరేపని లేకపోయింది.

"అమ్మో! నెలకు నూరు సవర్నుల ఉద్యోగులు వచ్చారు. వాళ్లు ప్రపంచంలో ఎవ్వరూ చేయలేనిపని చేస్తారట" అని భయపడి ఉజ్జయినీ ప్రజ అంతా, ఏవిధమైన దుర్మార్గ ప్రవృత్తులు లేకుండా హాయిగా ఉంటున్నారు.

ఇలా కొంత కాలం జరిగిపోయింది. ఒకనాటి సాయంత్రం రాజుగారి చిన్న కుమార్తె సుగుణ, ఒక దుష్ట నక్షత్రాన మరణించింది. ఆ నక్షత్రాన చనిపోయిన వారిని ఇంటిలో ఉంచరాదు. ఉజ్జయినికి మూడు మైళ్లలో ఉన్న భేతాళం అనే ప్రదేశంలో తెల్లవార్లు ఉంచి ఆ మరునాడు అంత్యక్రియలు చేయాలి. ఇదీ ఉజ్జయినీవాసుల ఆచారం.

అక్కడికు పట్టపగలు వెళ్లడానికే ఎంత యోధుడికైనా గుండె చాలదు. అటువంటిది – రాజకుమార్తె శవాన్ని పెట్టుకొని తెల్లవార్లు ఎవరు కావలా కాస్తారు? నగరంలో ఎవ్వరూ ఆపని కొప్పుకోలేదు. ఈ పని వీరచతుష్టయానికి తప్పలేదు.

భేతాళంవద్దకు తీసుకుపోయి శవాన్ని మధ్య ఉంచి, నలుగురూ నాల్గు వైపుల కూర్చొని, కావలా కాస్తున్నారు. ఇంతలో పెద్దవాడైన విజయసింహుని కొక ఆలోచన తట్టింది. వెంటనే తమ్ముళ్లతో యిలా అన్నాడు.

"మనం నలుగురం యిలా మేలుంటే మనకందరకూ ఒకేసారి నిద్ర రావచ్చు. అప్పుడే దెయ్యమో, భూతమో, ఈ శవాన్ని కాస్తా కబళిస్తుంది. కాబట్టి మనం నలుగురం, నాల్గు జాములు కావలా కాద్దాం. ఏమంటారు?" మిగతా ముగ్గురూ సరే నన్నారు. "అలాగైతే మీరు నిద్రపొండి. నేను మొదటిజాము కావలా కాస్తాను" అన్నాడు విజయ సింహుడు. మిగతా ముగ్గురు నిద్రపోయినారు.

విజయ సింహుడు ధైర్యంగా కావలా కాస్తున్నాడు. ఇంతలో— "ఏమండోయ్" అని స్త్రీ కంఠం వినిపించింది.

విజయ సింహుడు తన వీర ఖడ్గాన్ని ఝుళిపించి "ఎవరు?" అని గర్జించాడు. వెంటనే ఓ స్త్రీ దగ్గరకు వచ్చి – "నేను బ్రహ్మరాక్షసి

# ★ వీరచతుష్టయం ★

నరుకున్నారా? కత్తి చేత బుచ్చుకున్నారు" అని నవ్వింది. "నీ దేవరైతే నాకేం? ఇక్కడికెందుకు వచ్చావ్; చెప్పు?" అన్నాడు. విజయసింహుడు.

"మీరు పొరపాటున నిద్రపోతే శవాన్ని ఏ దెయ్యమో ఎత్తుకుపోతుంది. అందుచేత మీరు నిద్రరాకుండా ఉండటానికి నేను ఏజూదమైనా సరదాగా ఆడుకుందాం అని వచ్చాను." అన్నదా స్త్రీ. విజయసింహుడు జూదమంటే ధర్మరాజుకన్నా, పదిరెట్లు వ్యసనం గలవాడు. కాబట్టి ఉపక్రమించాడు ఆటకు.

"మరి పందెమేమిటి?" అన్నదా స్త్రీ.

"నీవే చెప్పు?"

"నేనుఓడిపోతే-పదిలక్షలరూపాయలుఖరీదుచేసే, ఈ పచ్చలపతకం మీకిస్తాను; మీరు ఓడిపోతే నాకేమీ వద్దు. మీరు నిద్రపోండి. అంతేచాలు; నేనుకావలాకాస్తాను" ఆస్త్రీపందెంలో అనుమానం కలిగినా. జూదమంటే ఉన్న వ్యసనంకొద్దీ, ఆట మొదలుపెట్టాడు విజయసింహుడు.

ఆటలో విజయసింహుడే గెల్చాడు. అప్పుడా స్త్రీ పచ్చల పతకంయిచ్చి, "ఇది నాకు కావాలి. దీని ఖరీదు తెచ్చియిస్తా. నాకు నా పతకం మళ్లీ యిచ్చేద్దురుగాని" అంటూ పరుగున వెళ్ళిపోయింది. ఇంతలో మొదటిజాము పూర్తి అయింది. రెండవవానిని లేపి. 'జాగ్రత్త!' అని చెప్పి విజయసింహుడు నిద్రపోయినాడు.

జయపాలుడు జాగ్రత్తగా కావలా కాస్తున్నాడు. ఇంతలో ఇందాకటి స్త్రీ వచ్చి "ఇదిగో తీసికోండి డబ్బు! నా పతకం నాకిచ్చేయండి" అని పదిలక్షలు ఇచ్చేసింది. అప్పుడు జయపాలుడు మనస్సులో "మా అన్నయ్య ఝాములో ఏదో తమాషా జరిగిఉంటుంది." అనుకొని, "ఆఁ...డబ్బు ఇలా యిచ్చివెళ్లు-ఆ రూపాయలు మంచివో చెడ్డవో రేపు చూద్దాం" అని, దగ్గరకువెళ్ళి-లాక్కున్నాడు. ఆమె చేసేదిలేక పలాయనమంత్రం పఠించింది. ఇంతలో జయపాలుని ఝాము కూడా పూర్తిఅయింది. మూడవ వాడు అజేయుణ్ణిలేపి 'జాగ్రత్త' అని చెప్పి నిద్రపోయినాడు.

అజేయుడు దీక్షతో కావలా కాస్తున్నాడు. ఇంతలో ఒక బ్రహ్మ రాక్షసివచ్చింది. ఆ రాక్షసి ఎవరో కాదు! ఇంతకు మునుపువచ్చిన స్త్రీయే - పచ్చలపతకం, పదిలక్షల రూపాయలు,పోయాయని కోపంతో వచ్చింది. అది మూడవఝాము. బ్రహ్మరాక్షసులకు అప్పుడు బల మెక్కువ. అజేయుడు భయపడకుండా కత్తితో దానిచేయి నరికాడు. ఆ బ్రహ్మరాక్షసి కుయ్యో —మొర్రో - అని మొత్తుకుంటూ పారిపోయింది. ఇంతలో మూడవ ఝాము పూర్తి అయింది. అజేయుడు విక్రముని లేపి తాను నిద్ర పోయినాడు.

విక్రమునికి ఏదో ఆలోచన కలిగింది. అమాంతం ఆ శవాన్ని ఎత్తుకొని నగరంవైపు నడచివెళ్లాడు. మధ్యదారిలో, కాళికాలయము ఉంది. ఆలయంలోపల మానవ కంఠాలు వినిపించినాయి. పొంచి విన్నాడు. "అమ్మా! కాళీ! యియ్యాల నూరు నవర్సుల ఉద్యోగులు భేతాళంలోఉన్నారు. నగరులో మేం మోసినంత బంగా

"ఏరా సీనూ? నీకంటె చిన్నవాళ్లతో స్నేహంచెయ్యి పెద్దవాళ్లతో వద్దని మొన్ననే గదా చెప్పాను? అప్పుడే గోవిందుగాడితో తిరుగుతున్నావే?"

"అదికాదమ్మా? గోవిందూ వాళ్లమ్మగారు నీకంటె రెండు రోజులముందే వాడితో 'నీకంటె పెద్దవారితో స్నేహం చేయకు' అని చెప్పారుట!. అందుకని గోవిందు అటు మొన్ననే నాతో స్నేహం చేయటం మొదలుపెట్టాడు మరి."

కమలా రామమోహనరావు,
కాకినాడ.

రం, డబ్బు దొరికితే రాజుగారి పెద్ద కుమార్తెను కోడికూసే వేళకి బలిస్తాం" అని వినిపించింది. వారు వెళ్లిందాకా దాక్కొని, తరువాత ఆలయంలోకి వెళ్లి దేవీవిగ్రహం చాటున కూర్చున్నాడు విక్రముడు.

దొంగలు, మోసినంత బంగారం, డబ్బూ తస్కరించి, రాజుగారి పెద్దకుమార్తెను నిద్రపోతున్న దానిని మంచంతోసహా తీసుకువచ్చారు. కాని, వాళ్లు గుగ్గిలం మరిచిపోయినారు. "నువ్వు పోరా!" అంటే "నువ్వుపోరా" అనుకొని, గుగ్గిలంకోసం అంతా బయలుదేరారు.

ఇంతలో రాజకుమార్తె మేలుకొని, పెద్దగా ఏడ్వసాగింది. అప్పుడు విక్రముడు, దేవీ విగ్రహం చాటునుంచి వెలుపలకు వచ్చి, ఆ అమ్మాయి భయంతీర్చి "నీవు నిద్రపోయినట్లు నటించు" అని చెప్పి, కాళీవిగ్రహం చాటుకు మళ్లీ వెళ్లాడు.

దొంగలు గుగ్గిలంతెచ్చి ధూపం వేసి, సాష్టాంగనమస్కారం చేసే సమయంలో విక్రముడువచ్చి అందరి తలలూ నరికివేశాడు. అప్పుడు విక్రమునికి దేవి ప్రత్యక్షమై, చనిపోయిన రాకుమార్తెను బ్రతికించి, అనేకవరాలు ఇచ్చి అంతర్ధానమైంది.

అప్పుడు విక్రముడు ఈ యిరువురు రాకుమార్తెలను ఆలయంలోనే ఉంచి నిశ్చింతగా వెళ్ళి భేతాళంలో నిద్రపోయినాడు. భళ్లున తెల్లవారింది. ఆదిత్యుడు సపరివారంగా కర్మకాండ జరిపించటానికి వచ్చాడు. నల్గురు భేతాళంలో నాల్గుప్రక్కల పడుకొని, నిద్రపోతున్నారు. శవమాత్రం లేదు. రాజు మండిపడి వాళ్ళను అదలించి లేపి, "ఇదేనా ప్రపంచంలో ఎవ్వరూ చేయలేని పని చెయ్యటం - మిమ్మ్ము ఉరితీయిస్తా చూడండి!" అన్నాడు.

అప్పుడు విక్రముడు, "ఆర్యా! చనిపోయిన శవంకోసం మీ రింత ఆవేశపడుతున్నారు గాని, బ్రతికిన పెద్దకుమార్తె విషయం తెలుసుకోండి" అన్నాడు. వెంటనే రాజు భటులను పంపించి తెలిసికొనగా, పెద్దకుమార్తె లేదు. అప్పుడు విక్రముడు జరిగిన ఉదంతంచెప్పి కాళికాలయమువద్దకు తీసికొని వెళ్ళి, ఇరువురు రాకుమార్తెలను చూపేసరికి అందరు ఆశ్చర్యపోయినారు.

ఆదిత్యసేనుడు, వీరచతుష్టయానికి తన నల్గురు కుమార్తెలను ఇచ్చి వైభవోపేతంగా వివాహంచేసి, తన రాజ్యాన్ని పంచియిచ్చాడు. వీరచతుష్టయం తమ తల్లిదండ్రులను తీసుకువచ్చి హాయిగా రామరాజ్యంలా తమ రాజ్యాన్ని ఏలుకున్నారు. ★

ఈ పయిన కొన్ని చిత్రాలు ఉన్నాయి. ఇవన్నీ 12 గీతలు, ఒక చుక్కతో తయారైనవే. ఇలాగే మరికొన్ని మీరు వేయగలరేమో ప్రయత్నించి చూడండి.

# గోపాలం పాలకొలత

"నాలుగు సేర్ల పాలు ఎలా కొలిచి ఇచ్చావు గోపాలం?" అని అడిగితే వాడు చెప్పినది ఇది.

"మొట్టమొదట ఎనిమిది సేర్ల పాత్రలోనుంచి మూడు సేర్ల పాత్రనిండా పాలుతీశాను. ఆ మూడు సేర్లు అయిదు సేర్ల దానిలో పోశాను. మళ్లీ పెద్దపాత్రలో మిగిలిన అయిదు సేర్లలోనుండి మరో మూడు సేర్లు పాలు అలాగే తీసి, అయిదు సేర్ల పాత్రలో మిగిలిన వెల్తి నింపాను. అంటే మూడు సేర్లలోను రెండు సేర్లు పోసేశానన్న మాట. ఇంకొక సేరు పాలు మూడు సేర్ల దానిలోనే ఉన్నాయి.

ఇప్పుడు అది అక్కడ ఉంచి, అయిదు సేర్ల పాత్ర నిండుగా ఉన్న పాలు, ఎనిమిది సేర్ల దానిలో పోశాను. ఖాళీ అయిన అయిదు సేర్ల పాత్రలో, మూడు సేర్ల పాత్రలో ఉన్న ఒక్క సేరు పాలు పోశాను.

ఇప్పుడు పెద్దపాత్రలో తక్కిన ఏడు సేర్ల పాలు ఉన్నాయిగా! అందులోనుంచి మూడు సేర్ల దానితో నిండుగా పాలుతీసి, అయిదు సేర్ల పాత్రలో పోశాను. అంతకుముందు ఉన్న ఒక సేరు, ఇవొక మూడు సేర్లు మొత్తం నాలుగు సేర్లు అయినాయి. అంతే."




## జరిగిన కథ :

ఫ్రాన్సు దేశంలో విప్లవం ఉధృతంగా ఉన్న రోజులు - చాలామంది ప్రభువంశీకులకు శిరచ్ఛేదం విధించబడింది. ఉన్నట్టుండి ఇలా శిక్షలు విధించబడినవారితో సహా, చాలామంది ప్రభువంశీకులు తప్పించుకు పారిపోవటం మొదలుపెట్టారు. కొంతమంది ఇంగ్లీషువారు సంఘంగా ఏర్పడి వారిని తప్పిస్తున్నారని వదంతులు బయలుదేరినాయి. వారి నాయకుడు ఎవరో ఎవరికీ తెలియదు. స్కార్లెట్ పింపర్నెల్ అనే మారుపేరుతో వ్యవహరిస్తుంటాడు. ఈ స్కార్లెట్ పింపర్నెల్ బిబట్ అనే ద్వారరక్షకుని కళ్లల్లో దుమ్ముకొట్టి, కాంటెస్ డి టూర్నే ను ఆమె పిల్లలు సుజేన్, వైకౌంటులను తప్పిస్తాడు. వారు ఛానెల్ దాటి ఇంగ్లాండ్ చేరుకుంటారు. మార్గరెట్ అనే ఫ్రెంచియువతి, సర్ పెర్సీ అనే ఇంగ్లీషువానిని పెళ్లిచేసుకొని లండన్ వచ్చేస్తుంది. ఈమె కూడా పెళ్లికాకముందు ఒకసారి ఒక ప్రభువుకు మరణశిక్ష వేయిస్తుంది. ఇంగ్లాండులో ఉండగా ఆమెను ఎన్నడూ కలుసుకోవటం తటస్థించరాదని కాంటెస్ కోరుకుంటుంది. కాని కాంటెస్ ఇంగ్లాండు చేరిన కొద్దిగంటల్లోనే ఆమె ఉన్న హోటలుకే మార్గరెట్ వస్తుంది. ఆమెపై తనకున్న ద్వేషం కొద్దీ కాంటెస్ మార్గరెట్ ను నలుగురిలో అవమానపరుస్తుంది. తరువాత సర్ పెర్సీ కూడా లోపలికి వస్తాడు. సర్ పెర్సీ మట్టిమందమతి, బద్ధకస్తుడు. వైకౌంట్ సర్ పెర్సీతో కలహానికి తలపడతాడు. కాని పెర్సీ వేళాకోళంగా మాట్లాడి కలహం తప్పిస్తాడు. మార్గరెట్ ఫ్రాన్సు పోతున్న తన సోదరుడు ఆర్మండ్ ను సాగనంపటానికి బయలుదేరుతుంది. ఆర్మండ్ ను సాగనంపి మార్గరెట్ వెనుతిరిగి వస్తూ ఉండగా, ఆమెకు పారిస్ లో ఉన్న రోజులలో తెలిసిన షావలిన్ కనిపిస్తాడు. ఫ్రెంచి ప్రభుత్వం తరఫున రాయబారిగా వచ్చినట్లు తెలిపి షావలిన్, స్కార్లెట్ పింపర్నెల్ ఆచూకీ తీయటానికి తోడ్పడమని కోరుతాడు. కాని మార్గరెట్ అంగీకరించదు. ఎందుచేతంటే మార్గరెట్ కు తన దేశంలో జరుగుతున్న విప్లవం అంటే సానుభూతి పోతుంది. స్కార్లెట్ పింపర్నెల్ అంటే ఆమెకు అభిమానం కలుగుతుంది.

## 5

మబ్బులన్నీ విచ్చిపోయినాయి. రెండు రోజుల పాటు ఎడతెరిపి లేకుండా కురిసిన వానవలన రోడ్ల మీద అక్కడక్కడ నీరు నిలిచి ఉన్నది. చెట్ల ఆకులనుండి వాననీరు ఇంకా బొట్లు బొట్లుగా పడుతున్నది. ఆకాశంలో నక్షత్రాలన్నీ కనిపిస్తున్నాయి.

ఆ రాత్రికి రాత్రే సర్ పెర్సీ, మార్గరెట్ లండన్ కు బయలుదేరారు. సర్ పెర్సీ కోచిగుఱ్ఱాలు మంచి ఉత్తమజాతివి. అటువంటి గుఱ్ఱాలు లండన్ లో ఇంకెవ్వరికీ లేవని అంటుంటారు. రాత్రివేళల వ్యాయంగా బండి తోలుకుంటూ దూర ప్రయాణాలు చెయ్యటమంటే పెర్సీకి మహాయిష్టం.

మార్గరెట్ పెర్సీ ప్రక్కనే కూర్చున్నది — ఆలోచనలలో మునిగి తేలుతున్నది. అలా ఎంతసేపు ప్రయాణం చేసినాసరే, పెర్సీ ఆమెతో నోరువిప్పి మాట్లాడడు. అంతగా ఎప్పుడయినా మాట్లాడినా, ఒకటో, రెండో పొడిముక్కలు మాత్రమే. "విధవది! దారి బాగాలేదు" అనో, "చలి చచ్చేఎక్కువగా ఉన్నది" అనో, మార్గరెట్ కు చాలా ఆశ్చర్యం వేస్తుంటుంది. ఇంత మౌనంగాఉండి, ఆ మట్టిబుఱ్ఱతో ఏమి ఆలోచిస్తుంటాడో ఊహించలేక విస్తుపోతుంది. అయితే ఆ ప్రశ్న ఎప్పుడూ ఆమె అడగనూ అడగదు. ఆయన చెప్పనూ చెప్పడు.

శివరోమన్స్ రెస్ట్ లో అంతా సద్దుమణిగింది. కాంటెస్, సుజేన్, వైకౌంట్ తమతమగదులలో చేరి నిద్రకు పడ్డారు. ఆండ్రూ, టోనీమాత్రమే మిగిలారు.

వారిరువురికి కూడా పక్కలు సిద్ధంచేసి జెల్లీ సెలవు తీసుకున్నాడు.

దీపాలన్నీ ఆర్పేసి ఇద్దరూ నెగడు దగ్గరచేరారు. హోటలు అంతటా ప్రశాంతత అలముకున్నది. హాలులోఉన్న గడియారం చేసే టిక్ - టిక్ చప్పుడు, నెగడులో మండుతున్న కట్టెల చిటపటలుతప్ప మరొక ధ్వని వినబడటంలేదు.

"ఆండ్రూ! ప్రయాణం సుఖంగానే గడిచింది కదా!" అని ప్రశ్నించాడు లార్డ్ టోనీ. "ఓ! నీ ముఖం చూస్తుంటేనే తెలిసిపోతున్నది. ఏం? ప్రయాణం మాంచి ఖుషీగానే ఉన్నదన్నమాట. అవును లే! సుజేన్ చాలా అందమైనపిల్ల. మరి ప్రయాణంలో కష్టంఎలాఉంటుంది?" అన్నాడు.



"......వెంటనే ఆ కౌగిలిం తగలబెట్టు..."

మనసంతా సుజేన్ మీదనే పెట్టుకొని కూర్చున్న ఆండ్రూ సన్నగా నవ్వాడు. "దానికేమిటి లేగాని! ఈసారి ప్రయాణంబహుశా నీవంతు అవుతుందేమో!" అన్నాడు మాటమారుస్తూ. "నాకే పెద్ద ఛాన్సు దొరికిపోయిందని బాధపడకు. పోయిరా! నేచెప్తున్నాగా. నీకూ మంచిఛాన్సే దొరుకుతుందిలే, బెంగపెట్టుకోకు."

ఈ మాటకు టోనీకూడా నవ్వుకున్నాడు. "మంచిదేగా!" అన్నాడు. ఒక్కక్షణంసేపు ఊరుకొని టోనీ "సరే, మనవ్యవహారం తొందరగాతేముల్చు." అని హెచ్చరించాడు.

ఇద్దరూ దగ్గరదగ్గరగా జరిగారు. బెదురుబెదురుగా చుట్టూ ఒకసారికలయజూచి పెదిమలు కదిలీ కదలకుండా అతిరహస్యంగా మాట్లాడుకోవటం మొదలుపెట్టారు. సర్ ఆండ్రూ చెప్పటం ఆరంభించాడు.

"మొన్న నేను కెలేలో స్కార్లెట్ పింపర్నల్‌ను కలుసుకున్నాను. మాకంటె రెండురోజులు ముందుగా ఆయన ఛానెల్ దాటి ఇక్కడికివచ్చేశారు. పారిస్‌నుండి కౌంటెస్‌ను వారిని ఎలా తప్పించాడనుకున్నావు? చూసితీరాలి. కాలాంతకుడని మెచ్చుకోలేక చస్తుంటారే బిబట్‌ను! వాడికి టోకరా యిచ్చాడూ?"

టోనీకి కుతూహలం ఉండబట్టలేదు. ఆ సమయానికి అక్కడ ఉండలేకపోతినే అని విచారించాడు. ఉత్సాహం పట్టలేక ఔడుకరిచి హుషారుగా "ఊఁ! తస్సదియ్య! చెప్పు, చెప్పు" అన్నాడు.

"వివరాలన్నీ తరువాత చెప్తాను. ఇక్కడ కాదులే!" అన్నాడు సర్ ఆండ్రూ బెదురుగా చుట్టూ చూస్తూ. "వచ్చే 2 వతేదీన నిన్ను, హేస్టింగ్స్‌ను కలేవచ్చి కలుసుకొమ్మని చెప్పమన్నాడు స్కార్లెట్ పింపర్నల్ — అంటే, వచ్చేబుధవారమన్నమాట."

"సరే వెళ్తాము. ఇంకా ఏమి చెప్పారు."

"ఈసారి పని అంత సులువుగాజరగదు. ఏమనుకుంటున్నావో! కౌంట్ డి టూర్నేను తీసుకురావాలి."

"నాకింకా ఏమీ కబురుచెప్పలేదా, అయితే?"

"ఉండు. కాస్త నిదానించు. చాలా ముఖ్యమైన విషయం ఒకటిఉన్నది. చెప్తున్నావిను. ఫ్రాన్సులోని ప్రస్తుతకిరాతక ప్రభుత్వం ఉన్నదే— ఆ ప్రభుత్వపువారు తమ తరఫున ఇక్కడికి ఒక అధికారిని పంపించినట్లు తెలిసింది. వాడిపేరు షావలిన్. వాడికి మనమంటే తగనిమంట. ఎలాగైనా మననాయకుని పట్టుకోవాలనే దురుద్దేశ్యంతో వాడుఇక్కడికి వచ్చాడు."

"ఏడిశాడులే వెధవాయి!"

"కాస్తఆగు. అంత తేలికగా కొట్టిపారెయ్యకు. వాడితోపాటు కొంతమూక కూడా వచ్చిందట. ఇందు

గల దందు లేదని సందేహము కలదన్నట్లు ఎక్కడ పడితే అక్కడవారు తయారై పొంచిఉంటున్నారుట. అందుకని మనము అనవసరంగా పదేపదే పదిసార్లు కలుసుకోకూడదని, అవసరమైనదానికంటె ఒక్క ముక్క ఎక్కువ మాట్లాడ కూడదని హెచ్చరించారు పింపర్నల్. ఎప్పుడయినా ఏదయినా ముఖ్యమైన విశేషం ఉండేపక్షంలో ఆయనే మనకు తెలియపరుస్తారు. అదీ సంగతి!"

ఈ మాటల సందడిలో వీరుఉండగా నెగడులోని మంటతగ్గిపోయింది. సన్నగా పొగ రావటం ఆరంభించింది. నెగడుకు మరీ దగ్గరగాఉన్న వీరిద్దరి మీద మాత్రం ఎఱ్ఱని వెలుతురు పడుతున్నది. తక్కిన హాలంతా చీకటిమయంగా ఉన్నది.

సర్ ఆండ్రూ జేబులోనుండి ఒకపుస్తకంతీసి, అందులో మడతపెట్టిఉన్న ఒకకాగితం బయటికి తీశాడు. మసక వెలుతురులోనే ఆ కాగితం చదవటానికి ఇద్దరూ తంటాలు పడుతున్నారు. ఆ సమయంలో వారి మనస్సంతా దానిమీదనే కేంద్రీకృతమై ఉన్నది.

హాలులో మోగుతున్న గడియారంధ్వని వారికి వినిపించటం లేదు. వారి వెనకాలఉన్న హోటలుబల్లల క్రిందనుండి ఒక మనిషి ప్రాకి దగ్గరకు చేరాడు. ఎంత చెయ్యకూడ దనుకున్నా, అలా ప్రాకుతున్నప్పుడు అయిన జరజరమన్న ధ్వనికూడా వారికి వినిపించలేదు.

"ఈకాగితంలో వ్రాసిఉన్న విశేషాలు బాగా చదివి, ఆకళింపు చేసుకొని, వెంటనే కాగితం తగలబెట్టు!" అని హెచ్చరించాడు సర్ ఆండ్రూ.

ఆ కాగితం ఆంటోని కిచ్చినతరువాత, మళ్ళీ ఆ పుస్తకం జేబులో పెట్టుకుంటున్నాడు ఆండ్రూ. ఇంతలో ఒక కాగితం అతని జేబులోనుండే ఎగిరివచ్చి, క్రిందపడింది. లార్డ్ ఆంటోని కూర్చున్న వాడు లేచి ఆ కాగితం ఏరిపైకెత్తాడు. "ఈ కాగితం ఏమిటి?" అని అడిగాడు ఆండ్రూను.

"ఏమో! నాకు తెలియదే!"

"బాగుంది. ఇది ఇప్పుడు నీ జేబులోనుంచే బయటపడింది గదటయ్యా!"

"నా జేబులోనుండి? నాకు తెలియకుండా, నా జేబులోకి ఎలావచ్చింది? ఓహో! అయితే పింపర్నల్ ఏదయినా కొత్తవిశేషం పంపించాడేమో? ఏదీ?"

ఇంతలో బయటవరండాలో ఏదో చప్పుడు వినిపించింది. ఇద్దరూ ఉలిక్కిపడి "ఏమిటిది?" అనుకున్నారు. లార్డ్ ఆంటోని చకచక తలుపువద్దకు వెళ్ళి, హఠాత్తుగా తలుపుతీశాడు.

తలుపు తెరచీ తెరవకముందే, ఎవరో లార్డ్ టోనీ ముక్కుమీద బలంగా కొట్టారు. ఆ దెబ్బకి టోనీ వెనక్కి వెల్లకిలాపడిపోయినాడు. సరిగా అదే సమయానికి, ఇంతకుముందే బల్లలక్రిందనుండి పాములాగా ప్రాకుతూవచ్చిన ఆమనిషిఎగిరి ఆండ్రూ మీదికి దూకాడు. ఆండ్రూకూడా క్రిందపడ్డాడు.

మొత్తంఅంతా రెండు మూడు సెకండ్లుపట్టింది. అంతే. ఏమిజరిగిందో తెలుసుకునేసరికి ఇద్దరి కాళ్ళు, చేతులు కట్టివేసిఉన్నాయి. నోరు మెదపటానికి వీలు లేకుండా గుడ్డకట్టివేసిఉన్నది. ఇద్దరు కొత్తమనుష్యులు వీరిని ఒకరి వీపుకు మరొకరివీపు ఆనించి నిలిపి, కలిపి కట్టివేశారు.

ఆ కొత్త మనుష్యులలో ఒకనిముఖానికి ఆచ్ఛాదనఉన్నది. అతడు గదిమధ్య హుందాగా నిలబడి చూస్తున్నాడు.

ఆండ్రూని టోనీని కలిపికట్టివేసిన తరువాత వారిద్దరూ ఆ మధ్య నిలబడినవానితో "అంతా సక్రమంగానే జరిగిందండి." అని చెప్పారు.

"భేష్! వారి జేబుల్లో కాగితాలేమైనా దొరుకుతాయేమో ఇ[illegible]ండి." అన్నాడతడు.

ఆ పని పూర్తి అయినతరువాత ఇంకొక నలుగురు మనుష్యులు వచ్చి, ఆండ్రూ, టోనీలను బుజాలకెత్తుకొని నిశ్శబ్దంగా తీసుకుపోయినారు.

ముసుగు ధరించిఉన్న అతడుమాత్రం కొంతసేపు అక్కడేనిలబడి, వారి జేబులలో దొరికిన కాగితాలు తీసి పరిశీలించాడు.

"ఫరవాలేదు. పడినశ్రమకు ఫలితం దక్కింది." అనుకుంటూ, ముసుగుతీసి, గుంటనక్క చూపులతో ఉత్తరాలు అక్కడొకటి, అక్కడొకటి చదివాడు. కనుబొమలెగరేసి, "ఊహుఁ! అలాగా? సరే, మార్గరెట్ బ్లాకనీగారు ఇంకెక్కడికి పోతారు? దొరికిపోయింది. ఇప్పుడుచూస్తాను. ఎవడికోసం సహాయం చేస్తుందో?" అన్నాడు.

ఆ కాగితాలు జేబులో పెట్టుకొని, ఒకపట్టు నస్యం వేసి, చేతులు నలుపుకుంటూ అతడుబయటికి నడిచాడు.

ఇంత అత్యాచారం జరుగుతుందనిగాని, జరిగిందనిగాని అక్కడెవరికీ తెలియలేదు. హోటలుయజ

మాని జెల్లీతోసహా, అందరూ సుఖంగా నిద్రపోతున్నారు.

## 6

కొన్వెంట్ గార్డెన్ నాటకశాల క్రిక్కిరిసి ఉన్నది. బ్రిటిష్ ప్రధానమంత్రి పిట్, విదేశాంగ శాఖా మంత్రి లార్డ్ గ్రెన్విల్, వేల్సుయువరాజు మొదలయిన గొప్పగొప్ప వారందరూ వచ్చారు.

లార్డ్ గ్రెన్విల్ ప్రక్కన ఆనాడు ఒక కొత్త వ్యక్తి కూర్చొనిఉన్నాడు. అతడెవరో తక్కినవారికి ఎవ్వరికీ తెలియదు. బక్క పల్చటిమనిషి— పిట్టంత ఉన్నాడు. గుంటలుపడినకళ్లు, గుంటనక్కచూపులతో ఆ నాటకశాలలో ఉన్నజనాన్ని శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు.

నాటకానికి కౌంటెస్ డి టూర్నే, సుజేన్, వైకౌంట్ కూడావచ్చారు. కౌంటెస్ విచారంతో క్రుంగిపోయిఉన్నది. సుజేన్, వైకౌంటు అంతమంది కొత్తవారి మధ్య కూర్చోవటంవలన బెరుకుపడుతూ ఉన్నారు.

లార్డ్ గ్రెన్విల్ తన చోటునుండిలేచి, కౌంటెస్‌ను పలకరించటానికి వచ్చాడు. కౌంటెస్ ప్రక్కన కూర్చున్న లేడీపోర్టెరిల్స్ లార్డ్ గ్రెన్విల్ దగ్గరకురావటంచూసి, కౌంటెస్ భుజంతట్టి చెప్పటం మొదలుపెట్టింది.

"అరుగో! లార్డ్ గ్రెన్విల్ వస్తున్నారు. రండి, రండి, ఫ్రాన్సునుండి వార్తలు ఏవీ తెలియటంలేదని కౌంటెస్ చాలా ఆదుర్దా పడుతున్నారు. మీ కన్నా ఏమయినా వార్తలు వస్తున్నాయా?"

లార్డ్ గ్రెన్విల్ నిరుత్సాహంగా, నీరసంగా నవ్వాడు. "వార్తలకేం? పారిస్‌నుండి ప్రతిదినం వార్తలు వస్తూనే ఉన్నాయి చల్లని కబురేలేదుగాని. ఇంతవరకు పరిస్థితులేమీ చక్కబడలేదు. పైగా మరింత ఘోరంగా తయారవుతున్నాయిట కూడా!" అని చెప్పాడు.

ఈమాటలు వినగానే కౌంటెస్‌ముఖం పాలిపోయింది. "ఆయన అక్కడ ఎటువంటి చిక్కులలో ఉన్నారోకదా! పాపిష్టిదాన్ని? నేనుమాత్రం ఇక్కడ హాయిగానాటకం చూడటానికి వచ్చి కూర్చున్నాను." అని వాపోయింది.

లేడీ పోర్టెరిల్స్ ఓదార్చింది. "అన్నీ తెలిసిన మీరే అలా అనుకుంటే ఎలా? పిల్లలనుచూసి అయినా కాస్త ధైర్యంగాఉండండి. లేకపోతే వారు మరీ బెంబేలు పడిపోతారు."

గ్రెన్విల్ కూడా ధైర్యంచెప్పాడు. "స్కార్లెట్ పింపర్నల్ సమితివారు మీకు అభయ మిచ్చారన్నారు కదా! మరి ఇంకేంభయం? వారు అన్నంతపనీ చేసితీరుతారు."

ఇంతలో గ్రెన్విల్ కూర్చొనివచ్చిన చోటు ప్రక్కనఉన్న ఆ కొత్తవ్యక్తి లేడీ పోర్టెరిల్స్ కంటబడ్డాడు. వెంటనే ఆమె గ్రెన్విల్‌ను అడిగింది.

"సరేగాని, మీ ప్రక్కన కూర్చున్న ఆ కొత్త మొహంఎవరు? ఫ్రెంచివాడేకదూ!"

"ఆయనా? ఫ్రెంచి ప్రభుత్వంవారు మన దేశానికి పంపినరాయబారి, షావలిన్."

"నా తలకాయ ఏమీకాదూ? అక్కడ ఒక ప్రభుత్వంకూడా ఏడ్చిందీ? నామాట వినండిలార్డ్! వాడు ఫ్రెంచివారి గూఢచారి అయిఉంటాడు. రాయబారికాదు, వాడిబొందకాదు."

కౌంటెస్ అందుకొని "అయితే అయిఉండవచ్చు. ఆమార్గరెట్ ఒకతెఉన్నదిగా వాడికిఇక్కడ ఆసరగా!" అన్నది.

లేడి పోర్టెరిల్స్ ఉలిక్కిపడింది. "అయ్యో భగవంతుడా! ఇదేంకర్మమంట! ఇట్లా మాట్లాడతారేమిటి మీరు? మీరుప్రస్తుతం ఉన్నపరిస్థితుల్లో లేడీ బ్లాకనీ గురించి అలా మాట్లాడటం ఎంతసాహసమో మీకు తెలియటంలేదు, మీరైనాచెప్పండి లార్డ్ గ్రెన్విల్!" అన్నది.

ఇంతలో లండన్‌ఫాషన్‌రాణి మార్గరెట్, సర్ పెర్సీతోసహా నాటకశాల ప్రవేశించింది. ఆమె ప్రవేశంతో పెద్దసంచలనం బయలుదేరింది. వేల్సుయువరాజు ఆమెనుచూడగానే చిరునవ్వుతో పలకరించాడు. అక్కడఉన్న అందరికళ్లూ ఆమెవైపే మరలినాయి.

మహాహుందాగా, వైభవంగావచ్చి మార్గరెట్ తన స్థానంలోకూర్చున్నది. మార్గరెట్‌వచ్చి కూర్చున్నప్పటినుండి షావలిన్ ఆమెవంక దీక్షగా చూడటం ఆరంభించాడు. మార్గరెట్ శ్రద్ధగా వాద్య సంగీతం వింటున్నది. సంగీతమంటే ఆమె చెవికోసుకుంటుంది.

తక్కిన అన్ని విచారాలు, ఆలోచనలుమాని తన్మయత్వంతో సంగీతంవింటున్నది.

పెర్సీకొంతసేపు ఆమె ప్రక్కనే కూర్చున్నాడు. నాటకం రెండంకాలు ముగిసిన తరువాత విరామం వచ్చింది. మిత్రులనందరిని పలకరించి వచ్చేటందుకు సర్ పెర్సీ మెల్లిగాలేచి వెళ్లిపోయినాడు.

ఇంతవరకు షావలిన్ మార్గరెట్‌తో మాట్లాడటానికి తగు సమయంకోసం కాచుకొని ఉన్నాడు. పెర్సీ వెళ్లిపోగానే షావలిన్ మార్గరెట్ దగ్గరకుచేరాడు. ఆమె కుర్చీవెనుకచేరి "ఒకచిన్నమాట చెప్పాలినీతో." అన్నాడు.

మార్గరెట్ హఠాత్తుగా ఎవరో వెనుకనుండి మాట్లాడటంతో ఉలిక్కిపడింది. తత్తరపడుతూ వెనుదిరిగిచూచింది. "ఓ! షావలిన్! అబ్బ! జడుసుకున్నాను ఎవరో అని! ఊఁ! మాట్లాడటానికి నీకు భలేసమయం దొరికింది." అన్నది.

"నిజమే. ఇంతకంటె మంచిసమయం దొరకటమంటేమాటలా?" అంటూ షావలిన్ మెల్లిగా పెర్సీ విడిచిపెట్టినకుర్చీ ఆక్రమించి సుఖాసీనుడైనాడు. "ఇంతకంటె మంచిసమయం ఎలాదొరుకుతుంది చెప్పు. లేడీ బ్లాకనీ ఎక్కడఉంటే అక్కడ పదిమంది చేరుతూ ఉంటారు. ఈపాతస్నేహితుడి మొర నీదాకా చేరదు."

మార్గరెట్ చిరాకుపడింది. "సరే! నాటకం అయిపోగానే నేను లార్డ్ గ్రెన్విల్ చేస్తున్న విందుకు వస్తున్నాను. అక్కడ విందు అయిపోయిన తరువాత ఒకఅయిదునిమిషాలు నీకు వ్యవధిఇస్తాను. మాట్లాడుదువుగాని ఏమిటోఅది." అన్నది.

"మార్గరెట్ సెంట్‌జస్ట్! ఎందుకు అంతశ్రమ నీకు? ఇప్పుడు మూడునిమిషాల వ్యవధి ఇవ్వచాలు. అయినా నేనుచెప్పేది వినటం నీకేమంచిది." అన్నాడు షావలిన్.

షావలిన్ ఈమాటలుచాలా తాపీగా మామూలుగానేచెప్పాడు. చెపుతూఉండగా ముఖభంగిమయినా మార్చలేదు. యథాప్రకారం చేతులు నలుపుకుంటూ కూర్చున్నాడు. కానిమార్గరెట్ ఈమాటలు వింటూ కంపించిపోయింది. ఏదో పెద్దప్రమాదం జరగబోతున్నట్లు ఒకఊహ ఆమెకుకలిగింది. షావలిన్ ముఖంవైపు చూసింది. షావలిన్ ప్రశాంతంగా నస్యంతీసి ముక్కుల్లోకి ఎక్కిస్తున్నాడు. గుంటలుపడిన అతని కళ్లలో ఎదుటివారి నెత్తురు గడ్డకట్టించే క్రౌర్యం, దుర్మార్గం, ఉన్నాయి.

మార్గరెట్ తేరుకొని, ఆలోచనలు నిగ్రహించుకొని "ఏమిటో! బెదిరింపుగా మాట్లాడుతున్నావే!" అన్నదిఎలాగో.

"ఎంతమాట! ఎంతమాట! నేను నిన్ను బెదిరించటమా?" అన్నాడుషావలిన్. అని ఒకక్షణం మౌనంగా ఊరుకున్నాడు. ఎదురుగా ఉన్నఎలుకతో చెరలాడుతున్న పిల్లిలాగా ఆమెవంకచూస్తూ ఆమె తనమాటలు విని ఎలామారుతున్నదో, ఆమె ఏమి ఏమి ఆలోచిస్తున్నదో ఆమెముఖభంగిమలనుబట్టి పరిశీలిస్తూ, ఇలా అన్నాడు.

"మీ సోదరుడు — ఆర్మండ్ సెంట్‌జస్ట్ — పెద్ద ప్రమాదంలో ఇరుక్కున్నాడు."

ఎంత బిగపట్టుకొని కూర్చున్నా ఈ మాట ఆమెపై విద్యుద్ఘాతంవలె పనిచేసింది. చాలా పరిశీలనగా చూస్తున్నషావలిన్ ఈసంగతి కనిపెట్టేశాడు. "ఫరవాలేదు.మార్గరెట్ చేతిలోచిక్కిపోయింది." అనుకొని మనస్సులో మురిసిపోయినాడు.

(ఇంకా వుంది)



జి. పి. యస్. ప్రొడక్షన్స్‌వారి మొదటి చిత్రంలో లక్ష్మిగా రాజ సులోచన.



భాస్కర్ ప్రొడక్షన్స్ వారు తీస్తున్న "చెరపకురా - చెడేవు!" చిత్రంలో
ఎన్. టి. రామారావు, చంద్రకుమారి.

# చిత్రనిర్మాణంలో సహాయదర్శకుని పాత్ర

## గరికిపర్తి సుబ్రహ్మణ్యం

చిత్ర నిర్మాణంలో సహాయ దర్శకుడు నిర్వహించే పాత్ర ఎంత ముఖ్యమైనదో పలువురు గ్రహించడం లేదు. డాక్టరుకు కంపౌండరు ఎంత అవసరమో చిత్రనిర్మాణంలో దర్శకునకు సహాయ దర్శకుడు అంత అవసరం. దర్శకత్వశాఖలో దర్శకుని భావాలు పూర్తిగా గ్రహించి ప్రతి విషయంలోను దర్శకునకు సలహాలు యిస్తూ కుడిభుజము వలె సహాయపడుతూ వుంటాడు సహాయ దర్శకుడు. వీళ్లిద్దరికీ ఏకీభావమున్నప్పుడు చక్కని కళగా చిత్రం రాణిస్తుంది.

కథ నిర్ణయమైన తరువాత రచయిత, దర్శకుడు, సహాయ దర్శకుడు ముగ్గురు కలసి కూర్చొని ఆలోచించి కథకు అనుకూలమైన సన్నివేశాలను, పాత్రలను, యితర విషయాలనుగూర్చి తర్జన భర్జనలు, వాగ్వివాదములు చేసి ఒక క్రమపద్ధతిలో సినాప్సిస్ తయారుచేస్తారు. రచయితకు, దర్శకునకు మధ్యవర్తిగా సహాయ దర్శకుడు పని చేస్తాడు. రచయిత వ్రాసిన సంభాషణలను సహాయ దర్శకుడు పూర్తిగా అవగాహన చేసుకొని, ఒక్కొక్క పరిస్థితిలో దర్శకుని సలహాలను తీసుకొని ఆయా సందర్భాలకి అనుకూలంగా మాటలు పాటలూ కూడా వ్రాయించగలిగే శక్తి వుండాలి సహాయ దర్శకునకు.

తరువాత కథనంతను కొన్ని సీన్సుగాను, ప్రతి సీనును కొన్ని షాట్సుగాను విభజిస్తారు. ప్రతి షాటునకు కావలసిన నటీనటులు, నటన, మాటలు, ఏవిధంగా నటులు నటించవలసింది ఆయా సీనులకు కావలసిన వాతావరణము, శబ్దాలతో దర్శకుని సలహాను అనుసరించి సహాయ దర్శకుడు వ్రాయగలిగే శక్తి కలిగివుండాలి. ఈ విధంగా వ్రాయుటను కంటిన్యూయిటీ అంటారు.

ఈవిధంగా ముందుగా వ్రాసుకొనుట వలన షూటింగు సమయములో దర్శకునకు షాటు డిజైను కళ్ళకు కట్టినట్లు వుండి, జరగబోవునటువంటి షాట్లు గురించి విపులంగా కెమేరామానుకు వివరించి తక్కువ కాలంలో ఎక్కువ షాట్లను తీయుటకు వీలుకలుగుతుంది. ఈవిధంగా వ్రాసుకొనిన తదనంతరం (*Paper work*) దర్శకుని షాటు ప్రకారం కళాదర్శకుడు సెట్టును



కె. పిక్చర్సువారి "జై మహాదేవ్" చిత్రంలో నారదుడుగా జీవన్, రతీదేవిగా నళినీజయవంత్.

# ★ చిత్రనిర్మాణంలో సహాయదర్శకుని పాత్ర ★

డ్రాయింగు రూపేణా కొలతలతో కాగితం మీద వ్రాసి యిస్తాడు. కళాదర్శకుడు దర్శకుని అభిప్రాయమును తీసుకొని, అంగీకరించిన (O.K) తదుపరి స్టూడియోవారికి సెట్టుకొరకు ఆ ప్లాను యిస్తాడు. స్టూడియోవారు ఆ సెట్టు వేసిన తరువాత ప్రొడ్యూసరు నిర్ణయప్రకారం ఏదో ఒక శుభ ముహూర్తాన షూటింగు ప్రారంభిస్తారు. ఆ దినమున అవసరమైనటువంటి వేషాలు, దుస్తులు, మేకప్ మొదలైనటువంటి వివరాలు ముందుగా దర్శకుడు, తన సహాయదర్శకునకు తెలియపరుస్తాడు. సహాయ దర్శకుడు కాల్‌షీట్ టైమునకు ముందుగా స్టూడియోకు వెళ్ళి నటీనటులకు కథలో ముందు తీసే షాట్లు వివరాలు చెబుతాడు. మేకప్ యిన్‌ఛార్జితోను, కాస్ట్యూమ్స్ యిన్‌ఛార్జితోను, మేకప్, దుస్తుల విషయాలు ముందుగా వారికి తెలియపరుస్తాడు.

షూటింగు సమయంలో సహాయ దర్శకుడు అనుభవజ్ఞుడవుతే ముందుగా కెమేరామాన్‌తో ఆరోజు తీయబోయే సన్నివేశాలని, స్థలకాల వివరాలను విపులంగా చెబుతాడు. ఛాయాగ్రాహకుడు, చిత్రము తీయునపుడు కంటిన్యూయిటీ సక్రమంగా ఉన్నదో లేదో పరిశీలించే శక్తి సహాయ దర్శకునకు వుండాలి. అతడు బాధ్యత లేనివాడైతే చిత్రమంతా అతుకులబొంతై నిర్మాత ద్రవ్యం బూడిదలో పోసిన పన్నీరవుతుంది. ఆయా సెట్టులలో కావలసిన వస్తువులు కథలో సీనునుబట్టి సహాయ దర్శకుడు ప్రొడక్షను మేనేజరుతో సంప్రతించి ఒకరోజు ముందుగనే సెట్టునకు తెప్పించి వాటిని సరియగు ప్రదేశములందు అలంకరింపజేస్తారు.

షూటింగు కాలములో యీ పనులన్నీ చాలా త్వరత్వరగా అతడు జరిపించగలగాలి. ఏమాత్రం బాధ్యత తక్కువైనా అనవసర వ్యయం అవుతుంది.

ముఖ్యంగా సహాయ దర్శకుడు బాధ్యతతో గుర్తించవలసినది షాట్ కంటిన్యూయిటీ, సెట్ కంటిన్యూయిటీ, డ్రెస్ కంటిన్యూయిటీ, మేకప్ కంటిన్యూయిటీ.

పై విషయాలన్నీ దర్శకుడు చూచుటకు ఒక్కొక్కసారి టైము వుండదు కాబట్టి సహాయ దర్శకుడు శ్రద్ధగా చూచుకోవాలి. అంతేకాక ఎప్పటికప్పుడు ఎడిటింగు నోట్సు సహాయ దర్శకుడు వ్రాసుకొని ఎడిటరుకు షాట్సు డివిజను క్రమపద్ధతిలో చెపుతూ వుండాలి.

ఇటీవల మన చిత్రపరిశ్రమ చాలా అభివృద్ధి పొందినా యింతవరకు సహాయ దర్శకులను ఏవిధంగా వుపయోగించుకోవాలో మన నిర్మాతలు గ్రహించలేదు. ఏదో కొద్దిమంది సహాయ దర్శకులను తీసుకున్నా వారిని సరిగా వుపయోగించుకొనుటలేదు. దర్శకులుకూడా సరిఅయిన సహాయ దర్శకులను తీసుకొనుటలేదు. తెలుగు చిత్ర పరిశ్రమలో ఖ్యాతిగడించినటువంటి కంపెనీలు, స్టూడియోలు కొన్ని వున్నాయి. చాలవాళ్లుగా సుస్థిరంగాఉన్న కంపెనీలైనా సహాయదర్శకులకు వారివారి కంపెనీలలో సుస్థిరస్థానము ఇచ్చి అనుభవజ్ఞులైన సహాయ దర్శకులను దర్శకులుగా చేయడానికి ప్రయత్నించాలి.

టెక్నికల్‌గా మన తెలుగు చిత్రాలకన్నా హిందీ చిత్రాలు బాగుంటాయి. అందుకు కారణం లేకపోలేదు. మన తెలుగు చిత్రాలలో ఒకరిద్దరిని మించి సహాయ దర్శకులు వుండరు. హిందీ చిత్రాలలో నలుగురు లేక అయిదుగురు వుంటారు. ఈవిధంగా వుండుటవలన ఒక్కొక్కరు ఒక్కొక్క శాఖను చూసుకోడానికి వీలవుతుంది. ఒకరు ఆర్టిస్టులకు డైలాగ్సు భావస్ఫోరకంగా చెప్పుటకు, రెండవ వ్యక్తి ఎడిటింగు నోట్సు వ్రాయుటకు, మూడవ వ్యక్తి డ్రెస్ కంటి

బెంగాల్ ఫిల్మ్ జర్నలిస్టులచే రెండుసార్లు ఉత్తమ నటిగా ఎన్నబడిన తార సుమిత్ర: అశోక్‌కుమార్‌తో కలిసి ఆమె నటిస్తున్న "దు ఆ" చిత్రంలో.

న్యూయిటీ, మేకప్‌కంటెన్యూయిటీని చూచుకొనుటకు, నాలుగవ వ్యక్తి సెట్ కంటిన్యూటీని చూచుటకు, అయిదవ వ్యక్తి క్లాప్ కొట్టుటకు వుంటారు. ఈ విధంగా ఒక్కొక్క శాఖకు ఒక్కొక్కరు వినియోగింపబడతారు. కాని మన తెలుగు నిర్మాతలు యిద్దరు సహాయదర్శకులను నియమించడానికే జంకుతున్నారు.

చిత్ర పరిశ్రమలో ప్రతి సంవత్సరము కొన్ని కోట్ల రూపాయలు వ్యయమవుతున్నవి. కొన్ని వేల ప్రజలు దీనిపై ఆధారపడి వున్నారు. కొన్ని కోట్ల రూపాయల ఆదాయం యీ పరిశ్రమనుంచి పన్నుల రూపములో ప్రభుత్వానికి చేరుతున్నది. కాని ప్రభుత్వము యీ పరిశ్రమలో టెక్నిషియన్లు ఏవిధంగా బాధపడుతున్నదీ, వాళ్లు ఏవిధంగా జీవిస్తున్నదీ అజ కనుక్కోవడం లేదు.

ఇతర దేశాలలో ఫిలిం పరిశ్రమకొరకు టెక్నికల్ విద్యాలయాలు ప్రభుత్వముచే నెలకొల్పబడి వున్నవి. కాని మనదేశములో మాత్రము యింతవరకు ప్రభుత్వము అట్టి అవకాశము కలిగించలేదు. నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు అధిక లాభాలు సంపాదిస్తున్నారు. కాని పరిశ్రమలోని టెక్నిషియన్లు పెక్కు యిక్కట్లకు ఆర్థికంగా గురి అవుతున్నారు. కనుక వీరి విషయమై సినీ టెక్నిషన్ల సంసలు, నిర్మాతలు, ప్రభుత్వమువారు ఇతోధికమైన శ్రద్ధవహించాలని నా విజ్ఞప్తి.

మద్రాసులో సుస్థిరములైన తెలుగు చిత్ర నిర్మాణ సంస్థలు తక్కువ. క్రొత్త నిర్మాతలు ఒక చిత్రం తీసి ఆర్థికలోపంచే తిరిగి వెళ్ళిపోతున్నారు. అటువంటి కంపెనీలలో పనిచేసిన టెక్నిషియన్లు వేరే దారిలేక యిక్కడ వుండి బాధపడడం జరుగుతోంది.

పది తెలుగు కంపెనీలు వుంటే, యిరవై మంది సహాయదర్శకులు వుంటున్నారు. పదిమందికి వుద్యోగాలు దొరికితే పదిమంది నిరుద్యోగంతో అల్లాడుతున్నారు. ఒక చిత్రము అయిపోయిన వెంటనే వేరొక చిత్రమును చూచుకొనుటకు అతికష్టంగా వుంది. పని తెలుసున్న కొందరు అనుభవశాలు రున్నప్పటికి, నిర్మాతలు వారిని ప్రోత్సహించడంలేదు. ఈవిధంగా అవస్థలు పడుతున్న టెక్నిషియన్లను కనీసం పెద్ద సంస్థలైనా ప్రోత్సహిస్తాయని తలుస్తాను. చదువుకొన్నవారు, యువకులు తాము పెద్ద కళాకారులు కావలెనని యితర పట్టణములనుండి మద్రాసువచ్చి సంవత్సరాల తరబడి యిక్కడ ఉండి బాధపడి, ఆశాభంగం పొందడం జరుగుతోంది. నిర్మాతలు, వీరి విషయం శ్రద్ధగా ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. 



ఐ. ఎమ్. పి. పి. ఎ. అధ్యక్షుడు ఎస్. కె. పాటిల్.

విఠల్ ప్రొడక్షన్స్ వారి "కన్యాదానం"లో జానకి, సురభి బాలసరస్వతి, కాంతారావు.

# బొంబాయి సినిమా లేఖ

ఐ. ఎమ్. పి. పి. ఎ. అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన తరువాత ఎస్. కె. పాటిల్‌గారు పత్రికా విలేఖరులతో గోష్ఠి జరిపారు. "సినిమా పరిశ్రమ చాలా క్లిష్ట పరిస్థితిలో ఉన్న సమయంలో నేను ఐ. ఎమ్. పి. పి. ఎ. అధ్యక్షపదవి స్వీకరించాను. క్లిష్టపరిస్థితులంటే నాకు చాలా యిష్టం," అని ఆయన అన్నారు.

సెన్సార్ షిప్‌ను సడలించాలని పాటిల్‌గారు ఉద్ఘాటిస్తూ ఇలా అన్నారు: "పబ్లిక్ సర్వీస్ కమీషన్‌వంటి సంస్థకు అప్పగిస్తే ప్రస్తుతపు సెన్సార్ బోర్డులోని సభ్యులలో నూటికి 95 మంది అసమర్థులని నిర్ణయమవుతుంది. బోర్డు సభ్యులు భారతీయ చిత్రాలను సాధారణంగా చూడరు. భారతీయ చిత్రాలమీద వారికి ఒకవిధమైన ఏవగింపు ఉన్నది."



హైదరాబాదులో జరిగిన క్రికెట్ ఆటలో పాల్గొన్న తారలు ఆశామథుర్, షమ్మీ.



"హూర్-ఇ-అరబ్"లో శశికళ.

భారతీయ చిత్రపరిశ్రమపై నిరాధారంగా విమర్శ జరుగుతున్నదని చెబుతూ "ఇటీవల పార్లమెంట్‌లోని 64 గురు సభ్యులు చలనచిత్రాలు అవినీతికరంగా ఉంటున్నాయని కాంగ్రెసు అధ్యక్షుడితో ఫిర్యాదు చేశారు. పరిశ్రమపై ఇంకా కఠిన నిబంధనలు విధించేటట్లు చేయాలని, ఇందుకు అవసరమైతే రాజ్యాంగాన్నయినా మార్చవలసిందేనని వారు ఒత్తిడి చేశారు. పరిశ్రమపై ఇంకా కఠినంగా నిబంధనలు వేయాలనడం మూర్ఖమైన వాదన. సినిమాలపై మనదేశంలో ఉన్నన్ని నిబంధనలు ప్రపంచంలో మరే దేశంలోనూ లేవు. పరిశీలన సంఘాలు, పునఃపరిశీలన సంఘాలు ఆమోదించిన చిత్రాలను కూడా నిషేధించే అధికారం ఈ దేశంలో ప్రభుత్వానికున్నది" అని పాటిల్ గారన్నారు.

పాటిల్ గారి నాయకత్వాన ఐ. ఎమ్. పి. పి. ఎ. పరిస్థితులను చక్కబెట్టడానికి పూనుకున్నది. ఫిల్మ్ ప్రొడ్యూసర్ల గిల్డ్‌లోని 8 మంది సభ్యులను తిరిగి తమ సంస్థలోనికి తీసుకురావాలని పాటిల్ ప్రయత్నిస్తున్నారు. వారి సహకారం పొందగలమనే ఆశ ఆయనకు పోలేదు.

* * *

ఇండియా, పాకిస్థాన్ దేశాల మధ్య జూన్‌లో జరుగనున్న వ్యాపారపు సంప్రదింపుల సందర్భంలో ఫిలిములనుగూర్చి కూడా చర్చలు జరుగవచ్చును. ఉభయదేశాల ఫిలిం పరిశ్రమలమధ్య స్నేహ సంబంధాలు నెలకొల్పడానికిగాను ఐ. ఎమ్. పి. పి. ఎ. వారు పాకిస్థాన్‌లోని భారత హైకమీషనర్ సి. పి. దేశాయిని, పాక్ వ్యాపార శాఖామంత్రి హబీబ్ రహీమతుల్లాను కలుసుకున్నారు. ఇండియాలోని పాక్ హైకమీషనర్ రాజా ఘజ్నఫర్ అలీఖాన్‌కు ఐ. ఎమ్. పి. పి. ఎ. వారు ఈమధ్య బొంబాయిలో విందుచేశారు. ఆ సందర్భంలో ఆయన ఫిలిముల విషయమై అభ్యంతరాలు తొలగించడానికి ప్రయత్నిస్తానని చెప్పారు.

* * *

ఫిల్మిస్తాన్ వారు నిర్మించుతున్న "బొంబే ఫ్లైట్ 417" అనే చిత్రాన్ని అకాష్ రాతోని డైరక్టు చేస్తున్నారు. ఈ చిత్రం కథను డైరక్టర్ రాతోని సహాయంతో ఫిల్మిస్తాన్ కథా శాఖవారు రచించారు. ఒక అమెరికన్ వైమానికుణ్ణి ఇద్దరు భారతీయ యువతులు గాఢంగా ప్రేమించడం వగైరా అంశాలతో ఈ కథ నడుస్తుంది. బొంబాయిలోని ఫిలింవర్గాలు ఈ కథ అంత గౌరవప్రదంగా లేదని ఆందోళన పడుతున్నారు. వైమానికుడుగా అలెక్స్ డి అర్సీ అనే అమెరికన్ నటుడు, విలన్‌గా జాన్‌లోడర్ నటిస్తున్నారు. అశోక్ కుమార్ ఒక సంస్థానాధీశుడుగాను, ప్రేమ్‌నాథ్ ఇద్దరు భారతీయ యువతులలో ఒకామెను ప్రేమించిన వ్యక్తిగాను నటిస్తారు. ఇద్దరు యువతులలో ఒకతెగా వైజయంతీమాల బహుశా నటించవచ్చు. చిత్రం సినిమాస్కోప్ టెక్నిక్‌లో ఉంటుంది. ★

## జి. వి. ఎస్. ప్రొడక్షన్స్ మొదటి చిత్రం

జి. వి. ఎస్. ప్రొడక్షన్స్‌వారి 'ప్రొడక్షన్ నం. 1' షూటింగ్ రేవతీ స్టూడియోలో త్వరితగతిని జరుగుతున్నది. దీన్ని ఇ. ఎస్. ఎన్. మూర్తిగారు డైరక్టు చేస్తున్నారు. నిర్మాత జి. సదాశివుడుగారు. కామెరా ఎ. విన్సెంట్; సంగీత దర్శకుడు ఘంటసాల.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, అమరనాథ్, రాజసులోచన, జానకి, సూర్యకాంతం, రమణారెడ్డి, కుటుంబరావు మొదలైనవారు నటిస్తున్నారు.

## గ్రంథ స్వీకారం

**ఫిలిం డైరీ 55:** సంపాదకుడు: అంబడిపూడి సుబ్రహ్మణ్యం; మహేంద్ర & కో, విజయనగరం; వెల 0-8-0; పేజీలు 60. తెలుగుసినిమా పరిశ్రమకు సంబంధించిన విషయాలను తెలుసుకోగోరేవారికి ఈడైరీ ఉపకరిస్తుంది. ★



పిల్లా పాపయ్యపాత్రుడు బ్రదర్సు అధిపతి పిల్లా నరసింహాపాత్రుడుగారి కుమారుడు చి॥ వెంకటగోవిందపాత్రునికి అదే సంస్థ మేనేజరు శ్రీ మాకిన నరసింహాపాత్రుడు గారి కుమార్తె సౌ॥ వరలక్ష్మి నిచ్చి యీ నెల 4 వ తేదీన జరిగిన వివాహ సందర్భమున తీసిన ఛాయాచిత్రము.

## ★ విజ్ఞాన వీధులు ★

(11 వ పేజీ తరువాయి)

ఈ లోహంపురేకు". లోహము అంటే Metal అన్న మాటకి తెలుగు. ఏ లోహమైనా డయాఫ్రంకి పనికిరాదు. ఇనుము ఉండాలి ముఖ్యంగా. 'లోహంపురేకు' అన్నది అర్ధసత్యం. ఉక్కురేకు, ఇనపరేకు అన్నవి "సామాన్య పాఠకులకు సుబోధకాలు" కావా?... "విద్యుచ్ఛక్తి ఎంతో ముందగతిలో, చాలా తక్కువస్థాయిలో బొగ్గుకణాలలోకి ప్రవహిస్తూ ఉంటుందిట', బొగ్గుకణాలలోకి" అన్నది అక్కడితో ఆగుతుంది అన్న అర్థమును స్ఫురింపజేస్తుంది. "బొగ్గుకణాలూ, తీగలూ, రిసీవరూ తీగలూ, ట్రాన్సుమిటరూ, బేటరీ ద్వారా అలాగ ప్రవహిస్తూనే వుంటుంది." అవాలి. "మాట్లాడేటప్పుడు ... కలుగుతే శబ్దతరంగాలన్నీ కలిస్తే ఈ 'కరెంటు' ఏర్పడుతుంది"ట. 'ఈ' ఏమిటో తెలియడానికి దాని ముందువాక్యాలలో ఏమీ లేదు. ఇక "కరెంటు" అంటే సామాన్య పాఠకుని కీవిపరీత ఆచార్యుడు నిర్దేశించిన అర్థమేమిటో? వైజ్ఞానికు లెరిగినంతవరకూ వారన్న "ఈ" సందర్భములో 'కరెంటు' ఏదీ ఏర్పడదు. ఇలాగ సాంకేతిక వస్తువును వివరించేటప్పుడు ముద్దముద్దకీ బిస్మిల్లాయేనా? ఇది నిండా ఇరవై క్రొనుపుటల వ్రాతలేని కథలో సంగతి. ఇక పెద్ద గ్రంథాలు మాట చెప్పను రావడము కాగితాల ఖరాబు కాదా?

భానుమూర్తిగారికి విద్యుచ్ఛక్తి అంటే ఏమిటో తెలీదు. "విద్యుచ్ఛక్తి ఫిలమెంటు నుంచి ప్లేటుకు ప్రవహిస్తుంది" అన్నారొక చోట. ఇక్కడ వాస్తవంగా ప్రవహించేవి ఎలక్ట్రానులు. విద్యుత్ప్రవాహము దిశ ఎలక్ట్రాను ప్రవాహానికి వ్యతిరేక దిశలో సాగు ననుట శాస్త్రసంప్రదాయము. కనుక పైన 'విద్యుచ్ఛక్తి' అనరాదు. ఇంకొకచోట "గ్రిడ్"కు అందజేసే విద్యుచ్ఛక్తినిబట్టి" అన్నారు. గ్రిడ్‌కు అందజేయబడేది విద్యుదావేశము. దీనిని 'విద్యుచ్ఛక్తిని అందజేయుట' అనకూడదు.

"ఇలాగ......ముక్కల వరసలు ముందు వెండిరేకు, ఆపైన తుత్తునాగపురేకు, దాని మీద తడితోలు ముక్క పేర్చిపెట్టేవాడు. ఈవిధంగా పేర్చడంవల్ల ఈ వరసలోనుంచి విద్యుత్తు ఎప్పుడూ నిశ్చలంగా ప్రవహిస్తూ వుండేది" అని ఒకచోట వ్రాశారు. అలా పెట్టినమాత్రాన, అదే రూపంలో ఒక బొమ్మ అచ్చుకొట్టినమాత్రానా విద్యుత్ప్రవాహము కలుగదు. ఈ వోల్టా కరెంట్ పైల్‌కు *Electrodes* అమర్చి, వాటిని బయటి తీగద్వారా కలపాలి. ఆ మాట ఎక్కడా లేదు. అది వీరికి తెలియదు. "నేను అలాగ మన ఇంట్లో పెట్టినా వస్తుందా?" అన్నప్రశ్నకు, "నిక్షేపంలాగ" అన్న జవాబుతో వోల్టా పైలు వెనక్కి వెళ్ళిపోయింది.

ఇక ఈలాటి గ్రంథాలు దిద్దేదు మనగా ఏమిటి? తిప్పి రాసుకోవడమే మెరుగు. విజ్ఞానశాస్త్రవస్తువు తెరుగకుండా వ్రాయుటెందుకూ? ఈ వ్రాతలవల్ల జరిగేదేమిటి? మొదటినుంచీ "రెండో ముద్రణలో దిద్దుకోడానికి వేచియుండడమే కాదా?" ఆ రెండో ముద్రణమే ముందు ప్రచురించకూడదూ?

భానుమూర్తిగారు వైజ్ఞానిక వస్తువు నిమిడ్చిన వ్యాసాలూ, గ్రంథాలూ వ్రాస్తే కష్టమే గాని లాభము లేదు. ఈ రకపు వ్యాసాలూ గ్రంథాలూ వారు పెంచుకుపోతే మొదల మీరేం చెయ్యగలరు నేనేం చెయ్యగలను? ★

(ఈ విషయమై చర్చ ఇంతటితో నిలిపివేయడమైనదని గుర్తింప ప్రార్థన.—సంపాదకుడు.)



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, ThambuChetty St Madras.



స్త న్య మ ధు వు

చిత్రకారుడు : కల్యాణప్రసాదశర్మ—విజయనగరం.